# అష్టావక్రచరిత్రము

## ( పద్యకావ్యము )



కావ్యకర్త

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, బి. ఏ.,

సంపాదకుఁడు, 'వావిళ్ల నిఘంటువు'

ఆంధ్రభాషాధ్యాపకుఁడు, పిఠాపురరాజకళాశాల,

కాకినాడ.



సర్వస్వామ్య సంకలితము  1946 ౧౯౪౬ మే  మూల్యము రూ. ౧-౮-౦

# ఉపోద్ఘాతము

"నానృషిః కురుతే కావ్య" మ్మనియు, "శుచిః కవిః" అనియుఁ గవి ప్రశంస. కవిత భాషాపరిజ్ఞానమాత్రమున బహుగ్రంథపఠనమాత్రమున లభించునది కాదు. దానికి లోఁతయిన, సునిశితము, సహజము నైన ప్రజ్ఞాప్రతిభానము మూలము. అది కలవానికి భాషాపరిజ్ఞానాదు లుపకారము లగును. అంతేకాని యివి కవితను బుట్టింపఁజాలవు. అనేకత్ర వర్తమానులలోఁ గవితావ్యవహారము చుట్టుపట్టుల సహృదయులలోను, గ్రంథములలోను దేలియాడుచుండు భావముల పునశ్చర్వణ రూపము లగుట గుర్తింపనగుచున్నది. ఇట్లుగాక యుపజ్ఞతో నుత్తమకవితను వెలయించువారు కొందఱే యరుదై యున్నారు. ఈ "యష్టావక్రచరిత్రము" భారత చరిత్రమేయైనను, దీనిపునారచనమునఁ జక్కనియుపజ్ఞాకల్ప మగుకల్పనము గలదు.

కాళిదాసునాటకత్రయ కథావస్తువులు కాళిదాస మనః ప్రవృత్తులకును, భవభూతినాటకకథావస్తువులు భవభూతిమనః ప్రవృత్తులకును దర్పణము లైన తార్కాణలు. ఇక్కడ నీ యష్టావక్రచరిత్రమును బ్రస్తుతకవిమనః ప్రవృత్తులకు స్పష్టమైన తార్కాణ. నేటికాలమున విద్యాభ్యాసవ్రతు లయి గృహస్థులు గావలసి యున్న విద్యార్థుల కందఱకు నీకథావస్తువు ముఖ్యముగా సమాలోచనోచితము. భారతమునుండి దీని నుద్ధరించి, కవి, యౌచితీసుందరముగ నించుక ప్రపంచించి, లఘుప్రబంధము గావించెను.

ఋషుల నాఁటియమాయికాఖ్యాయిక యిది. నాఁటిమునివాటికలు, ఆ మునులమనఃప్రవృత్తులు, వారి యమాయిక స్పష్ట సత్య సంకల్ప సంభాషణలు చక్కఁగా నిందు సంరక్షితములైనవి. అంతరింపనున్న రఘుమహావంశమును అస్ఖలిత బ్రహ్మచర్యుఁడు, మహాశాంతమూర్తి, యమాయికుఁడు, నగు ఋశ్యశృంగుఁడు సంరక్షించినాఁడు; రామాదుల మహాపురుషులఁ దనతపోమహిమచే లోకమున కనుగ్రహించినాఁడు. వంశనాశనమునకు శపింపఁజాలినవిశ్వామిత్రాదులతీరునకు, వంశ వర్ధనమున కనుగ్రహింపఁజాలిన ఋశ్యశృంగునితీరునకు నెంతభేదము !

మనకథలోనియస్తావక్రుఁడు ఋశ్యశృంగునితీరువాఁడు. మాఘ వదాన్యుఁడు త్తరదిగంతమునకుఁ బోయి రమ్మనుట యాతనిబ్రహ్మచర్యదీక్షాపరాకాష్ఠను బరీక్షించుటకుఁ గదా! అందుఁ గృతార్థుఁ డయి యాతఁడు రాఁ గల్గెను. ఇట్టి శీలనైశిత్యముకలవారు సర్వకాలములయందును మహర్షికల్పులై యారాధనీయులగుచునే యుందురు. భారతవర్షమున స్త్రీపురుషులలో నిట్టిశీలసంపద కొంతవఱకైన సురక్షిత మగుచుండుటచేతనే నేఁటికిని నాధ్యాత్మికాభ్యున్నతి యిట జగజ్జ్యోతియై వెలుఁగుచున్నది.

కృతికర్త తనగురువరేణ్యునిఁగూర్చి చేసినప్రస్తుతి మనోజ్ఞమై, మహనీయమై, పైయర్థమునకుఁ దార్కాణయై యున్నది. నన్నిచోడునిగురుప్రస్తుతి దీనికి దీటు. భగవత్పర మైనగురుశిష్యాంతరంగవ్యవహారము, లౌకికబాహ్యవ్యవహారతంత్రమువలె వెల్లడికావలసినది కాదు. కనుక నిక్కడఁ గృతిపతు లగుకృతిప్రణేతగురువర్యుల నామాదినివేదనము కానరాకుండుట యౌచితీవిలసనమే యౌ ననుకొందును. పరవిద్యాకన్యాప్రదాత యగుగురువరేణ్యుఁడును, దత్పరీక్షలలో నెగ్గి సద్విద్యాకన్యాపరిగ్రహము గావించిన ప్రస్తుతకృతిప్రణేత యగుశిష్యుఁడును, వదాన్యాష్టావక్రులలో నంతర్భవించిరేమో యని పాఠకులకుఁ దోఁచుచున్నారు.

ఈగ్రంథమున గద్యపద్యముల రచనాసౌష్ఠవము పేర్కొనుట యొకవిశేషవిషయము కాదు. శుచి యైనయంతఃకరణముతో శుచి యైనకథావస్తువును గుర్తించి దానిని శుచి యైనభాషతో వెలయించి "శుచిః కవిః" యన్నవైదికసూక్తికి మన 'కవికుమారుఁడు' తార్కాణ మైనాఁడు. రసము నిండు శుచియ. సహృదయు లగు పురుషులు సంతోషముతోఁ జదువఁ దగినసద్గ్రంథ మిది.

తిరుపతి.

వేటూరి ప్రభాకరశాస్త్రి.
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యాపీఠము.

# కవినివేదనము

" శ్రీగురుచరణద్వంద్వం వందేహం మథితదుస్సహద్వంద్వం
భ్రాంతి గ్రహోపశాంతిం పాంసుమయం యస్యభసితమాతనుతే.
దేశికవరం దయాళుం వందేహం నిహతనిఖిలసందేహం
యచ్చరణద్వయ మద్వయ మనుభవ ముపదిశతి తత్పదస్యార్థం."

పరమపావన మగునాంధ్రసారస్వతమునకుఁ గవిత్రయప్రసాదిత మగుభారతామ్నాయము, భాస్కరాది కవిప్రణీత మగురామాయణకావ్యము, పోతనాదిమహాభక్తకవిలిఖిత మగుశ్రీమద్భాగవతపురాణము నిత్యనూతనము లగుపట్టుఁగొమ్మలు. ఈగ్రంథత్రయపఠనపారాయణాదికముచే నాంధ్రు లెల్లరు నిత్యముక్తు లగుదురనుట నిస్సంశయము.

ఇందు భారతామ్నాయమునఁ గలకథాభాగములు సుధార్ద్రము లగురసగుళికలు, పరమధర్మప్రబోధకములు, భవ్యార్థప్రతిపాదకములు. ఉత్తమబ్రహ్మచర్యాశ్రమధర్మముల సుశ్లేషించుటలోను వివాహవయోగుణసామర్థ్యములఁ జాటుటలోను నాదర్శజీవనవిధులఁ దెలుపుటలోను నారణ్యానుశాసనికపర్వములఁ గల యష్టావక్రోపాఖ్యాన మత్యుత్తమము. ఆకథాభాగమును గైకొని రసోచితవిపర్యయములతోఁ గావ్యరూపమున లిఖించితిని. ఈకావ్యావతరణము నాకవితాకన్యకుఁ దొలిరూపము.

ఈయష్టావక్రచరిత్రము భారతారణ్యానుశాసనికములందే కాక విష్ణుపురాణము బ్రహ్మవైవర్తపురాణము విచిత్రరామాయణములందును గలదు. కాని, భారతారణ్యానుశాసనికపర్వములఁ గలకథాభాగమే యిందు గృహీతము. ఈతనిపరిపూర్ణచరిత్రము నా 'శ్రీమహర్షిజీవితకథామృతము'న విపులీకరించితిని. అష్టావక్రుఁడు బాల్యముననే జనకాస్థానపండితసభలో వంది నోడించుటయుఁ బిమ్మట నిర్వక్రుఁ డగుటయుఁ రెండుమూఁడుముద్రణములలోఁ జేర్చితిని. ఈతఁడు పిమ్మట జనకున కొసర్చినజ్ఞానోద్బోధము "అష్టావక్రసంహిత" యనుపేర సంస్కృతమునఁ గలదు. దాని నాంధ్రీకరించితిని.

దీనిని మదరాసువిశ్వవిద్యాలయమువారు బి.ఏ., ౧౯౪౦-౧౯౪౬ పరీక్షలకు, నాంధ్రవిశ్వవిద్యాలయమువారు భాషాప్రవీణ తుదిపరీక్షకును పాఠ్యగ్రంథముగ నిర్ణయించిరి. తత్తధికారుల కెల్లరకును గృతజ్ఞుఁడను. భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి గారికావ్యము నిసుమారు ముద్రించి యిచ్చి ప్రోత్సహించిరి. వారి యుపకృతి మఱువఁజాలను. ఇందలి గుణలేశమునే గ్రహించి నన్నాశీర్వదించిన పండితమండలికి భృత్యభావమున నమస్కరింతును.

ఇట్లు, బుధవిధేయుఁడు,

కాకినాడ. బులుసు వేంకటేశ్వరుడు.

# అభిప్రాయలేశములు

1. “ఇందలి పద్యములు లలితపదయుక్తములు మనోహరములు. ఇది శాస్త్రిల-పాఠ్యపుస్తక మగుటకుఁ జాలఁ దగియున్నది.”

శ్రీవిక్రమ దేవవర్మ. (జయపురాధీశులు.)

2. “ప్రాచీనప్రబంధశైలి నలరినయీపద్యకావ్య మీరచయితసరసకవితా ధారకుఁ జక్కనిప్రమాణము.”

అభినవ వాగనుశాసన
శ్రీమల్లాది సూర్యనారాయణ శాస్త్రి.

3. “పద్యములనడక, శబ్దసౌష్ఠవము, భావగంభీరత యెంతయు స్తుత్యములు. ప్రసన్నమగు మీకవితామృతధార సహజసుందరము.”

‘కవితాభూషణ’ శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

4. “ఈచిన్న కావ్యము ముద్దులమూటవలె నన్నాకర్షించినది. అతిమనోహరము లైనపద్యములు లలితము లైనభావములు ఆదర్శప్రాయ మైనయాశయములు కలసత్కావ్య మిది.”

డాక్టరు. గిడుగు సీతాపతి.

5. “ధారాళము నిర్దుష్టము నైనశైలి పవిత్రము లైనభావములు సర్వజనోపయోగి యైననీతి కలిగి యీకావ్య మెంతయు హృద్యముగా నున్నది.”

శ్రీ దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ.,
(ఆనర్సు).

6. “ఇందలిపద్యములు జీవరత్నములు. ఇట్టిరత్నాలంకృత మగు‘అష్టావక్రచరిత్ర’ మాంధ్రభాషాయోష కమూల్యభూషణ మనుట స్వభావోక్తి.”

మధునాపంతుల సత్యనారాయణశా[illegible]

7. "వెంకటేశ్వరకవి మహాభారతగాథలను యథాతథముగా స్వీకరించి సందర్భానుసారముగా ఇతివృత్తము ప్రపంచించినాడు. ఈకావ్యములో గురుశుశ్రూష, గార్హస్థ్యప్రాశస్త్యము, బ్రహ్మచర్యదీక్ష, ఉత్తరదిగంగనాఘట్టము కొంత విపులీకరించినాడు. ఇందులో ప్రబంధలక్షణైకలక్ష్యాలు గాని సందర్భవిహీనవర్ణనలు గాని అనుచితములు జుగుప్సితములు నైనభావాలు గాని లేవు. కథాప్రసంతి అడ్డు లేకుండా ప్రవహించినది. పఠనకుతూహలము సడలకుండా జాలువారినది. కావ్యము సరళముగా ధారాళముగా నడచినది."

శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి,
('రేడియో'లో)

౮. "ఉత్తమభావముల నుత్తమశైలిలోఁ బ్రకటింపఁ గలిగిన కొలఁదిమంది మనీషులలో వీరొకరు. శ్రేయస్సాధనము లగుసంఘటనములనే వీరు కావ్యవస్తువుగా గ్రహించు టెంతయుఁ బ్రశంసనీయము. ఆధునికపద్యకావ్య మగు నీయష్టావక్రచరిత్రము సర్వవిధముల నిర్వక్రమై పండితపామరజనరంజకమై యలరారుచున్నది."

శ్రీ చిరంతనానందస్వామి,
('రామకృష్ణప్రభ'లో)

9. ప్రశంసనీయ మగుఅష్టావక్రమహర్షిచరిత్రము మనోహరమగు ధారాప్రవాహములో నామూలాగ్రముగా నడచినది. 'భారతి'

10. "ఇందొకమహర్షిచరిత్ర చక్కని శైలిలో వర్ణింపఁబడుట ప్రశంసనీయము.

శ్రీ నిర్వికల్పానందస్వామి,
('ఆంధ్రపత్రిక'లో)

11. "ఉచిత మగుప్రబంధవర్ణనములతో సులభమై మృదుమధురముగ నుండునట్లు రచింపఁబడినది." ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

12. "ఆధ్యాత్మికేతివృత్తమును గైకొని యొప్పించుట యీకవికిఁ గలప్రత్యేకత, ఈకావ్యమునఁ గల రామణీయకము." త్రిలిఙ్గ.

i. "The author expands the story proper with relevant descriptions of nature, in lucid verse. The life of the Brahmacharya and the ideal of student life are ably dealt with here and are quite worthy of appreciation. Being a theme of high morality and superb austerity, the work has twice been prescribed for B. A. Students of the Madras University. **Prof. VIRARAGHAVACHARYA,**

*(In "The Indian P. E. N. Bombay).*

"The theme is very competently handled". Sahitya Ratna K. Sun dara Rama Sarma, M.A.M.O.L.

*(In The Hindu, Madras.)*

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 1 | భక్తులలై | భక్తులునై |
| 4 | 17 | కృవ | కృప |
| 5 | 5 | పాశ్యాత్య | పాశ్చాత్య |
| 6 | 4 | రక్షింపఁగ | రక్షింపఁగఁ |
| 15 | 16 | ఎఱిగించెను | ఎఱిఁగించెను |
| 20 | 3 | విడిపించె | విడిపించెఁ |
| 51 | 1 | కౌరవ | కౌరవ |
| 69 | 11 | బతి | పతి |
| 73 | 12 | జనలు | జనులు |

ఓం

శ్రీగురుభ్యో నమః.

# అష్టావక్రచరిత్రము

## పీఠిక.

శ్రీదము లైనవిష్ణుపద
సేవనముల్ పరమార్థతత్త్వసం
పాదకముల్ మహోన్నతశు
భస్థితిమూలము లన్నసత్యసం
వాదము లేనుమహాత్ముని శు
భప్రదజీవితసౌఖ్య మైన వా
వేదవిదుఁడా గురూత్తము న
భీప్సితసిద్ధికిఁ గొల్తు నిచ్చలున్. ౧

ఉ. శ్రీగురుదేవపాదసరసీరుహదివ్యమరందలబ్ధశో
భాగురుభాగ్యమే పరమపావనజీవనలక్ష్యభూతమై
భోగము లేల యింద్రపదభోగములే తృణమాత్రమై మహా
యోగులు నైత మందనిసుఖోన్నతి నందుటఁ గొల్తు మద్గురున్.

శా. శ్రీవాణీగిరిజాత్రయిం గను శుభశ్రీవైదుషీజ్ఞానభా
గ్యావాప్తిం బొనరింప మద్ధృదయపద్మాంతస్థునుం జేసి మ
ద్భావోద్భాసులఁగా నొసర్చెద జగద్భద్రానుసంధాయులౌ
శ్రీవిష్ణ్వబ్జభవాష్టమూర్తుల నవిచ్ఛిన్నప్రమోదాప్తికై. ౩

మ. తొలికావ్యంబయి నిత్యనూత్నమయి సంతోషంబుఁ జేకూర్పఁగాఁ
బలుకుల్ భావములున్ మనోహరములై భాసిల్ల మాధుర్యకో
మలతాస్ఫూరకతన్; రసానుభవమున్ మాధ్వీరుచిన్ మించఁగన్
విలసద్రామకథన్ రచించినకవిన్ గీర్తింతు వాల్మీకులన్. ౪

చ. వినఁ జదువన్ స్తుతింపఁగను వీనులవిందును నేత్రపర్వమున్
జనిసఫలత్వముం గలుగ శాశ్వతసౌఖ్య మొసంగఁ జాలుపా
వనతమభారతశ్రుతి విభాసిలఁ జేసినవ్యాసదేవునిన్
మనమున నెంతు నున్నతనమస్కృతులన్ భజియింతునిచ్చలున్.

శా. యోగానంతమహాప్రభావమున సంయోగంబుగా నెల్లెడన్
యోగబ్రహ్మము నాశ్రయించి పితరుం డోహోయనన్ సర్వలో
దోగోళంబుఁ బ్రతిధ్వనింపఁగ మహాత్ముండున్ మహాయోగి యౌ
త్యాగిన్ శ్రీశుకు నిత్యమున్ దలతు మత్స్వాంతంబునన్ భక్తితో.

చ. పుడమి సమస్తభాషలకు మూలము సంస్కృత మందు రందునన్
బొడమినదివ్యకావ్యములు పూర్ణరసోదధు లౌను తత్కవుల్
కడుమహనీయు లన్నిటను గాన భజింతును వారి నెల్ల నే
నొడఁబడిపోదు వారలమహోన్నతదివ్యతపఃప్రభావళికిన్. ౭

ఉ. భారతసంహితన్ వివిధపర్వరసోదయ మేదురంబుగా
నేరుపుమీఱుభక్తి ద్విగుణీకృతశక్తి రచించి యాంధ్రభా
షారతి నన్నపార్యకవిచంద్రుఁడుఁ దిక్కనశంభుదాసు ల
వ్వారిపదంబు లంటి కడుభక్తిని మ్రొక్కెద నిష్టసిద్ధికిన్.

మ. కవులై భక్తులునై మహామహిములై కారుణ్యపూర్ణాత్ములై
కవితానందసుధాప్రవాహమున నిష్కామంబుగా నీశ్వరున్
సవిలాసంబుగ నోలలార్చినమహాసత్త్వార్థసంపన్నులన్
గవిరాట్పోతనధూర్జటిప్రముఖులన్ గైసేయుదున్ భక్తితో.

చ. తెలుఁగు పవిత్రభాష; వినుతింపఁగఁజాలిన దేశభాషలన్
వెలుఁగు నతిప్రసిద్ధ మని విశ్రుతకీర్తుల దివ్యదీధితిన్
తెలుఁగుఁగవిత్వ మొప్పఁగ వినిర్మల తత్త్వవిచార మాకవీం
ద్రులు మునిశేఖరుల్ ప్రియముతోడుతఁ గొల్చెద వారి నెల్లరిన్.

చ. నవరసపూర్ణముల్ పరమసవ్యములున్ హృదయానుమోదముల్
జవయుతజీవసంగతయశస్కరముల్ పరమప్రబుద్ధ భా
గవతమహత్త్వవిస్తృతవికాసకథాకమనీయకావ్యసం
భవకరులై నయాంధ్రకవిభాస్కరులన్ వినుతింతు నెంతయున్.

చ. కవి ఋషికల్పుఁ డౌట ఘనకావ్యము వానితపఃఫలంబుగా
వివరణచేయు నేను సుకవిప్రభుదివ్యవచస్సమోఘమే
యను నటు గానఁ గొల్చెద నహర్నిశమున్ సుకవీంద్రునిన్ బరా
భవ మొసరింతు దుష్కవి సభాగ్యశిరోమణి నెల్లవేళలన్.

*మ. అమలార్ష ప్రతిభాప్రభావసుమహత్త్వాంగీరసాయాస్యగౌ
తమమౌనీంద్రులు మాఋషిత్రయము; వేదప్రస్ఫుటోదారధ
ర్మమమత్వంబె నిరంతరోద్యమము నస్మద్వంశమర్యాదయున్
విమలాచారపవిత్రవర్తనమె మాపిత్రార్జితం బెన్నఁగన్. ౧౩

* ఈగుర్తులు గలపద్యములు ప్రథమముద్రణమున లేవు.

*ఉ. పావనగౌతమీతటనివాసతపోధికపుణ్యమూర్తులై
జీవితముల్ ఋగధ్యయనశిష్యగణాఖిలధర్మబోధదీ
క్షావసరంబులై వ్యయము సల్పి గడించిరి మోక్షలక్ష్మి నా
గ్రావని నాదుతండ్రియు నుదారుఁడు తాతయుఁ దాతతండ్రియున్.

*చ. జనని సదాశివాఖ్య విలసద్బుధవర్యునికూర్మిపట్టి పా
వని యగునన్నపూర్ణ; పితృపాదులు వేంకటసుబ్బయాహ్వయుల్
వినుతయశుల్ మదగ్రజులు వేంకటరామయ వేంకటేశ్వరుల్
చినయన రామనాముఁడు ప్రసిద్ధుఁడ నేను సుహృద్విధేయుఁడన్.

*క. ఆముష్యాయణుఁడను నే
నాముష్మికసౌఖ్యరతుఁడ నాచార్యార్చా
ప్రేముఁడను వేంకటేశుఁడఁ
గామేశ్వరిలలితహస్తకమలార్చితుఁడన్. ౧౬

ఉ. మామకభాగ్యదేవతగ మామకపూర్వతపఃఫలంబుగా
మామకరక్షకుండుగ నుమాపతిభక్తవరిష్ఠుఁడైనపు
ణ్యామలకీర్తనీయకరుణాపరదివ్యమహర్షి సద్గురుం
డై మముఁగాంచవచ్చి కరుణామృతవృష్టినిముంచెఁ దృష్టిగన్.

ఉ. ఆమహనీయు దివ్యకృప కాకర మైనమదీయభాగ్య మే
నేమని చెప్పుకొందును గ్రహింపఁగఁజాలఁ గృతజ్ఞతోక్తిఁగా
వ్యామలపద్మ మొక్కటి మహాత్మున కంకితమీయ నెంచి నే
నామది నూహచేసి రచనంబొనరించితి భక్తియుక్తులన్. ౧౭

గీ. భారతామ్నాయమున వనపర్వమందు
నానుశాసనికంబున నలరునట్టి
ఘనమహర్షి యష్టావక్రకథను గావ్య
ఫణితి వ్రాసితి లలితాంధ్రభాషలోన. ౧౯

గీ. నేటిపాశ్చాత్యవిజ్ఞానసీరధిఁ బడఁ
బ్రాచ్యవిద్యాసమార్జనపాటవంబు
సన్నగిలిపోవ జ్ఞానంబు సన్నగిల్లె
సన్నగిలిపోదె పాండితీసార మింక. ౨౦

ఉ. కావున మత్కవిత్వమునఁ గానఁగవచ్చు ననేకదోషముల్
భావవిహీనశబ్దములుఁ బ్రాజ్ఞతిరస్కృతవాక్యదోషముల్
కేవల మిన్నియున్ విడువఁ గృత్యము విజ్ఞుల కింక భక్తి సం
భావనచేయఁగోరుదును భవ్యమునీంద్రుగుణంబు లెన్నఁడున్.

మ. తనసర్వస్వముఁ బారమార్థికమహత్త్వస్ఫారవిజ్ఞానసా
ధనున్ హోమ మొనర్చి సిద్ధిఁ గని నిత్యానంద నిర్మగ్నుఁడై
దినముల్ పుచ్చుచునుండు మద్గురువు నుద్దేశించి కేల్మోడ్చి నె
మ్మన మానందసుధాస్రవంతిని సుమగ్నోన్మత్తంబునై తేలఁగన్. ౨౧

శా. ఏదివ్యర్షి ముఖావలోకనమహాదృష్టమ్ము మాత్రాన నే
దో దివ్యత్వసుఖమ్ము మైఁ బడఁగ నాదుఃఖాగ్ని చల్లారునో
యేదివ్యర్షి మహాప్రబోధఝరి నాకెంతే మహాజ్ఞానభా
షాదీప్తిప్రద మాయె నట్టిగురు నశ్రాంతంబుఁ గీర్తించెదన్.

మ. గురునామస్మరణామృతంబున మహాఘోరాఘసంతానముల్
హరియింపంబడు నిందు సంశయము లేదావంతయుంగానఁ ద
చ్చరణాబ్జంబులె నమ్మి యుండు నిఁక వాత్సల్యాతిరేకంబుచేఁ
బరిరక్షింపఁగ గొల్తు నాత్మగురుదేవబ్రహ్మచూడామణిన్.

క. కరుణారసపరిపూర్ణుఁడుఁ
బరమానంద ప్రభూతభావన సుఖియౌ
పురుషునకుఁ సరసునకుఁ
నరహరిపూజానిమగ్న నవ్యాత్మునకున్. ౨౫

క. భోగియును సర్వకర్మ
త్యాగియు నొకమాత్రయైనధన్యాత్మునకుఁ
యోగియును ముక్తివనితా
భోగియు నై నట్టిసహజపుణ్యాత్మునకున్. ౨౬

క. గురువునకు సర్వదుష్కృత
హరునకుఁ బరమాత్మఁ గన్నయమివర్యునకుఁ
బరమునకు భక్తితత్త్వ
విరళమహాదానదివ్యవిఖ్యాస్మృతికిన్. ౨౭

క. గానామృతనాదబ్ర
హ్మానందసుఖాబ్ధి నోలలాడించెడివి
ద్యానూనచక్రవర్తికి
మానీంద్రగుణాభిజాత మాన్యాత్మునకున్. ౨౮

క. నవరసభావనసర్వా
నవద్యునకుఁ బుణ్యునకు ననల్పశ్రీసం
భవునకు భవసాగరముం
దవలీలగఁ దేలియాడునట్టిబుధునకున్. ౨౯

*క. సాక్షాదనంగహరునకు
విక్షేపత్రయము నెల్ల విడిచినఋషికిన్
బ్రత్యక్షరవశవర్తికిఁ బ్ర
త్యక్షమహేశ్వరునకు విమలానందునకున్. ౩౦

*క. అస్మత్సర్వమునకు ముర
ఘస్మరుదివ్యావతారఘనరూపునకున్
భస్మావలేపనోత్సుక
విస్మయహరిహరసురూప విబుధేంద్రునకున్. ౩౧

*క. బ్రహ్మణ్యశిరోమణి సు
బ్రహ్మణ్యమహానుభావ పరమాత్మునకున్
బ్రహ్మణ్యలోకపతికిని
బ్రహ్మార్పితమతికిఁ బరమభవ్యాత్మునకున్. ౩౨

వ. హృదయపూర్వకనమస్కారపురస్సరంబుగా నాయొనర్పంబూనిన
యష్టావక్రచరిత్రమునకుఁ గథాక్రమ మెట్టి దనిన.

ఓం

# ష్టావక్రచరితము

## ప్రథమాశ్వాసము.

— : o : —

—♦ కథాప్రారంభము ♦—

శ్రీ రమ్యంబులు ధర్మమర్మములు ని
శ్శేషంబు తోషంబు త
న్నారన్ దెల్పెడి భీష్ముఁ గన్గొని తగన్
గాంగేయమూర్ధన్యుఁ "డో
కౌరవ్యోత్తమ! నాకుఁ జెప్పఁగదవే
కన్యాప్రదానంబు నె
వ్వారల్ పొందఁగ నర్హు"లం చడిగినన్
వాత్సల్యలక్ష్మీశుఁడై. ౧

శా. "ఇష్టార్థంబుల నీవిధం బెఱుఁగఁగా నిచ్ఛించుచో నీకు నే
నష్టావక్రచరిత్రఁ దెల్పుదుఁ దదీయాఖ్యాన మీ ప్రశ్నకున్
స్పష్టం బై సహితంబులే నొడువు విన్నన్ శ్రద్ధతో నీమనో
భీష్టంబౌ"నని చెప్పె భీష్ముఁ డపు డుర్వీభ్లారఁ గాంగేయుఁడున్.

చ. "అది యొక కాననాంతరమహామహిమాస్పదపుణ్యభూమి, యు
భ్యుదయిమహామునిప్రకరపుణ్యతపఃపరిపాకదివ్యసం
పదలకుఁ దావలంబు, నిజభారతదేశమహత్త్వతత్త్వసం
పదలకుఁ బుట్టినిల్లు, భువిపై దివి, సర్వసుపర్వపర్వమున్. 3

# ప్రథమాశ్వాసము

ఉ. కన్నులపండు వై ప్రకృతికాంత చరింపఁగ నైజరూపసం
పన్నత సర్వసౌఖ్యపరివర్ధక మైనప్రశాంతదివ్యభా
గ్యోన్నతి నివ్వటిల్లు సమకూర్చు నిరంతర మాత్మతృప్తి య
భ్యున్నతదైవనిర్మితమహోత్తమపుణ్యవనప్రదేశముల్. ౧

గీ. ఆవనప్రాంతదివ్యమాహాత్మ్య మే మొ
కడునిరక్షరు నైనను గవిని జేసి
పరమకల్యాణవిమలసంభరితమధుర
గీతికాలాపమగ్నసుకృతిని జేయు. ౨

చ. పరమసుఖాత్మకం బమలభావవిరాజితనిత్యనూత్న మా
పరవసభూమియందున భవంబును గాంచి మహామునీశ్వరుల్
పరమునుగూర్చి స్వీయఘనభాగ్యమహోదయులై త్యజింపఁగాం
తురు క్షణికంబులై పరమతుచ్ఛము లౌనిహలోక సౌఖ్యముల్.

గీ. ఆవనాంతరభూమి సమాశ్రయించి
కొన్ని దివ్యాశ్రమములు నికుంజములును
మిగులనైపుణ్యమున వినిర్మించుకొనిరి
కొందఱుమునీంద్రు లొక్కటఁ గూడి మనఁగ. ౪

శా. ఆదివ్యాశ్రమపుణ్యభూములను నిత్యానందు లై యుండి ని
ష్ఖేద బ్రహ్మపరాయణాత్ము లయి శుష్కీభూతసర్గాత్రులై
యాదిత్యోపము లగ్రవంశజులు భార్యాపుత్త్రులంగూడి ధ్యా
నాదిస్వచ్ఛతపోగరిష్ఠు లయి సౌఖ్యంబుందు రెల్లప్పుడున్. ౫

ఉ. ఎచ్చటఁ జూచినన్ సమిధ లేఱుమునీంద్రసుతప్రకాండు లే
యెచ్చటఁ గాంచినన్ బనస లేకరువిచ్చుమునీంద్రచంద్రు లే
యెచ్చటఁ గన్న నుజ్జ్వలితహేమరుచుల్ వెలిగ్రక్కువహ్ను లే
ముచ్చటగొల్పు మానిజనమోహనజీవన మాశ్రమంబులన్. ౯

మ. ఒకనారీతిలకంబు సంతసముతో నొప్పారులేజింకకున్
వికసత్పద్మనిభాననంబున లసత్ప్రీతిన్ దృణాగ్రంబు లొ,క్కొక
కొన్నింటి నొక్కొక్క మాఱిడఁగ నంఘ్రుల్ సాఁచి మేయన్ మహో
త్సుకతన్ వచ్చి గ్రహింపఁగోరు నొకశార్దూలంబు వానిన్ వెసన్.

చ. అలసట నంది యొక్కహరిణార్భక వచ్చి మృగేంద్రుసందిటన్
బొలుపుగ నిద్రవోవ మునిపుత్త్రి యొకర్తుక వచ్చి సింహమున్
దలపయి దువ్వుచున్ నిలువ నాకఁగ వచ్చును వ్యాఘ్రబాల యా
సలలితబాలగాత్ర మది సన్నుతిఁ జూచుఁ గరేణుయూథముల్.

ఉ. ఆశ్రమపుణ్యభూముల విహారము చేయుమృగంబు లెల్ల ము
న్యాశ్రితవృత్తిమైఁ దమదినంబులు పుచ్చుచు నుండుఁగాని య
న్యాశ్రితజీవికన్ గడప వన్నము మాంసమొ కాని యవ్వి దూ
రశ్రమ కోర్చి యేఁగి తిని రాఁ దొడఁగున్ ఘననిష్ఠ నిల్పుచున్.

ఉ. ఆవనవాసమందలిమహాసుఖముల్ గుఱుతింప రావు సం
భావన కంద వెన్నఁడు శుభప్రతిపాదకముల్ జగత్స్థిత
స్థావరజంగమాత్మకపదార్థవశీకరణ ప్రభావముల్
జీవితసార్థకత్వసవిశేషసుఖప్రదదివ్య హేతువుల్. ౧౩

గీ. నగరవాసంబులందుఁ గానంగనైన
క్రౌర్యకాఠిన్యకుటిలతల్ కానరావు
ఆత్మసంబంధులే కాని యంద అచట
నవమపృష్ఠాగతంపుబాంధవము లేదు. ౧౪

గీ. మునిశిరోమణు లందు ముముక్షువు లయి
జీవయాత్రల వెళ్లఁబుచ్చెదరు కాని
సారహీనసంసారకాంతారమందుఁ
గ్రూరమార్గములం బట్టి క్రుంగిపోరు. ౧౫

గీ. మునిసతీనివహంబు ముప్ప్రొద్దులందు
శౌచలక్ష్మీనికాయంబుసరణిఁ దోఁచుఁ
బతుల నలరించు టనెడితపంబె వారి
కృశశరీరమనోజ్ఞతాకృతి ధరించు. ౧౬

గీ. మునికుమారసమాజ మెప్పుడును గూడ
నిత్యసంశుద్ధమై పితృనివహమునకు
వలయుసంభారములఁ దెచ్చుపనులయందు
నధ్యయనమందు ధ్యానంబునందు నుండు. ౧౭

మ. పరనారీపరకాంచనాభిరతి యెవ్వారుం గనంబోవ రా
దర మెవ్వారికి లేదు భౌతికసుఖత్వానందనిర్మగ్నతం
వరణీయంబులు కావు భోగములు నిర్వాణప్రభాలక్ష్మియే
పరమార్థంబుగ నున్నవారలమహత్త్వం బెన్న సామాన్యమే. ౧౮

ఉ. అందు వసించుమౌనిజనులందఱిలో మహనీయమౌనిసం
క్రందనుఁ డేకపాదుఁడు విరాజిలు దివ్యసతీమతల్లి యై
నందినభర్తృపూజల ననారతముఁ జగదీశ్వరార్చనా
నందసుఖాబ్ధిఁ దేలుచు మనంబున నొప్పుసుజాత భార్యగాన్. ౧౯

*శా. శ్రుత్యుక్తప్రతికర్మనిర్వహణమే శుద్ధాత్మగేహంబునం
దత్యంతాత్మసుఖప్రదంబుగ జగద్ధర్షంబునుం గూర్చ దాం
పత్యానూనవిశిష్టయోగమున బ్రహ్మానందముం బొందువా
రత్యూర్జస్వలులై భజించిరి కుమారార్థంబు సర్వేశ్వరున్. ౨౦

*క. ఈశ్వరకృప సోఁకుటయు ము
నీశ్వరకరుణాకటాక్షహితశోభితమౌ
నీశ్వరతరుణీరత్నము
శశ్వద్గర్భంబుఁ దాల్చె శమదమయుతయై. ౨౧

క. చనుమొనలు నల్లనయ్యెను
గనుసన్నలు హెచ్చె లావు గనె నెన్నడు మం
గన కంతకంత కద్భుత
ఘనుఁ డగు తనుజాతుపుట్టుకం దెల్ప ననన్.

శా. వేదాధ్యాపనమే తపోంగముగ భావించెన్ మునీంద్రుండు స
ద్వేదాభ్యాసకుతూహలాత్ములగునంతేవాసు లర్థింపఁ దా
బోధింపంగఁ దొడంగె వేదములు మాపుల్ రేపు నిట్లుండఁగాఁ
బ్రాదుర్భావమునందు బాలుఁ డివి నేర్వంగల్గె గర్భస్థుఁడై. ౨౩

గీ. "స్వరము తప్పితి" వని తండ్రిఁ జక్కదిద్దు
"నేల రేయింబవళ్లు శిష్యాళిచేత
నల్లె వేయించి బాధింతు? వొల్లమి" నను
మాతృగర్భమునుండియే మాన్యుఁ డతఁడు. ౨౪

గీ. ఏకపాదుండు సుతుపల్కు లాకళించి
మోహమును ద్రెంచి ధర్మప్రబుద్ధితోడ
"వక్రముగఁ బల్కె శ్రుతిఁ గూర్చి బాలుఁ డిట్టు
లష్టవక్రతలం బుట్టు శిష్టుఁ డయ్యు." ౨౫

క. అని శపియించెను దనసుతుఁ
డనుపమసద్బుద్ధిశాలి యని యెఱిఁగియుఁ దాఁ
దనసుతుఁ డని విడిచినచో
మనఁగలఁడే పరమధర్మమార్గచ్యుతుఁడై. ౨౬

మ. నవమాసంబులు నిండె సంతటను గాంతారత్న మత్యార్తితో
ధవుపాదంబుల మ్రొక్కి "నాథ! కరుణాతాత్పర్యచిత్తుండ వై
తివి తైలంబు ఘృతంబు నాపురిటికై తేఁబోవవే సత్కృపా
త్మవిశిష్టున్ మిథిలాధినాథునడుగం దానీయఁడే ద్రవ్యముల్!"

క. అని ఘనదౌహృదభారం
బునఁ బలుకుసుజాతమాట ములుకయి హృదినాఁ
టిన బయలుదేఱి వెడలెను
జనకస్థానంబుఁ జేరఁ జయ్యన మునియున్. ౨౭

గీ. జనకునాస్థానపండితసభను "వరుణ
పుత్త్రుఁ డగువంది గెలిచినపురుషవరున
కేది వలసిన నిచ్చెద వాద మందు
నోడిన జలమజ్జితుఁ డయి యుండవలయు." ౨౯

చ. అని జనకుండు పల్కఁ హృదయంబున మెచ్చుచు నేకపాదుఁ డం
తన నిజపాండితిన్ వరుణనందనుతోడివివాదమందు నో
డిన వెనువెంట నే యతని డించిరి నీటను రాజసేవకుల్
చని వినిపించి రెవ్వరో సుజాతకు సర్వము నామె యంతటన్. ౩౦

క. పతిఁ బంపినదుష్కృతమున
కతిదుఃఖము నంది దైవ మరయును నను నా
పతి యుండుఁగాక! హరర
క్షితుఁడై క్షేమమున ననుచు స్థిరచిత్తమునన్. ౩౧

క. దినములు గడపఁగ నొకనాఁ
డనుపమలగ్నంబునందు నాయమ ప్రీతిన్
దనయుని గనియెను వంకర
లెనిమిది గలవాని నొక్కహిమకరతేజున్. ౩౨

క. అష్టాంగసుందరుండు త్రి
విష్టపసామ్రాజ్య మేలువిభవము గలవాఁ
డష్టావక్రుండయ్యెను
శిష్టులశాపంబు లెంత చేయవు! ధరలోన్. ౩౩

గీ. సరిగ నాలగ్నమున నే సుజాతమాత
వకానియుద్దాలకునిభార్య మానసీయుఁ
దైనపుత్త్రుని గనె; శ్వేతుఁ డైనకతన
శ్వేతకేతుం డనెడిపేరఁ బరఁగు నతఁడు. 34

సీ. శ్వేతకేతుఁడె తనభ్రాతగా నుద్దాల
కుండె తండ్రిగ నెంచుచుండి పెరుఁగు
చుండె నష్టావక్రుఁ; డొండొకదినమున
మాతులుం డగు శ్వేతకేతుఁ గూడి
బాలుఁ డష్టావక్రుఁ డాలసింపక తాత
శిర మెక్కఁ జూచెడి తరుణమందు
శ్వేతకేతుఁ డసూయ నాతనిఁ జేసేత
నడఁచి "హో! మీయయ్యకడవు" ననిన

గీ. చిన్నఁబోయిన మొగముతో సిగ్గువడుచుఁ
బరితపించుచుఁ దనతల్లిపదము లంటి
"తండ్రి యెవ రమ్మ! నా"కన్నఁ దల్లడిలుచు
సుతున కెఱిగించెను సుజాత పతిచరిత్ర. 35

క. విని వినినంతనె "తండ్రిని
గొనివచ్చెదఁ బంపు"మనుచుఁ గొమరుండనముక్
ఘనధైర్యము సాహసమును
గనఁబడఁగా దల్లియానఁ గైకొని యంతన్. 36

ఉ. బాలుఁడు మానిపుత్త్రుఁడు నృపాలునివీటికి నేఁగి వందిసీ
గోలుమసంగఁజేసి తనకుఁ గడుఁ గూర్చెడితాతపాదుసీ
లీల గడించి తెత్తు నని నిర్భరమోదమునఁ గమించె నా
ద్దాలకమాతులుండు తనదండను రా మిథిలాపథంబునన్.

క. కడువేగంబున వచ్చెడి
బుడుతలఁ గని ద్వారపాలబుధు లాఁపఁగ వా
రడలక "తడవానరింపక
యెడ మిడుఁ డిట వంది గెలువ నేఁగెదుమాకున్." ౩౮

గీ. అనుచుఁ బలికెడుబాలురయానసంబు
లగ్నిసందీపకంబులై యమరఁ జూచి
ద్వారపాలురు భయపడి వారిఁ గాంచి
"వృద్ధులే కాని బాలురు వెడలరాదు. ౩౯

గీ. జనకు నాస్థానపండితసభకు మీరు
నాలుగై దేండ్లబాలురు మేలు గాదు
వందితో వాద మొనరింప వచ్చు టేల
మగిడి పొం"డన్న వా రనుమాన మెడల. ౪౦

క. "బాలుర వృద్ధుల నెన్నఁగఁ
జాలరు మీ రెవ్వ రిందుఁ జాలింపుఁడు భూ
పాలకుఁ జూపుఁడు లేదా
పాలగుదురు తీవ్రశాపవహ్ని" కనంగన్. ౪౧

గీ. ద్వారపాలురు జనకభూపాలుతోడ
వేనివేదించి యావిప్రవృత్త మెల్ల
నాతఁడును వారిఁ దోతేర ననుమతింప
బాలురను నిల్పి రాభూమిపాలు నెదుట. ౪౨

గీ. జనకుఁ డొకనవ్వు నవ్వి "యీఘనుల ? వంది
గెలువ వచ్చినవా !" రని గేలిసేయఁ
బల్కె నప్పు డష్టావక్రబాలమౌని
మేఘగంభీరనినదంబు మిన్నుముట్ట. ౪౩

గీ. "జనకరాజర్షి వీవు విజ్ఞానశాలి
వనుచు విని యున్నకతమున మనము లలర
వందితో వాదమున గెల్వ వచ్చినాము
కాని నీ విట్టిఁ డౌ టెఱుఁగంగ నయ్యె. ౪౪

క. బాలురమఁట ! విజ్ఞానులు
బాలుర ? వార్ధక్యభారవహులా జ్ఞానుల్ ?
చాలుంజాలును నీ కిది
యేలా ? కనరాదె వంది నెటు గెల్చెదమో." ౪౫

క. ఆపల్కులు విని జనక
క్ష్మాపాలుఁడు లేచివోయి గౌరవమున నా
పాపలఁ గూర్చి వినుం డని
వేప్రశ్నల నడుగ చిత్రవిధమున నంతన్. ౪౬

క. అష్టావక్రుఁడు మృదువుగ
స్పష్టంబుగ క్షణములోన సర్వముఁ దెలుపన్
సాష్టాంగ మెఱఁగి జనకుఁ డ
భీష్టం బది తీఱ వందిఁ బిలిపించుటయున్. ౪౭

గీ. పండితాఖండలుల మ్రోల నిండుసభను
వాద మారంభమాయెను వందితోడ
ముక్కువచ్చులె యాఱనిముద్దుబిడ్డఁ
డద్భుతంబుగ వాదింప నడరె నపుడు. ౪౮

మత్త. "అగ్ని యొక్కఁడె ప్రజ్వలించెను నాకసంబున సూర్యుఁ డు
ద్విగ్నమాననుఁ డొక్కరుం డయి వెల్గుచుండును నిత్యమున్
మగ్నభక్తుఁడు శర్వుఁ డొక్కఁడె మాన్యదైవము సృష్టిలో
భగ్న మన్నది లేదు నా"కని వంది పల్కఁగ బాలుఁడున్. ౪౯

మత్త. "పర్వతుండును నారదుండును బ్రాణమిత్త్రము లిద్దఱే
సర్వభక్షుఁడు నింద్రుఁ డిద్దఱు సంచరింతురు మైత్త్రిచే
నిర్వహిల్లును నాలుగేస్తుల నిత్యసంసారంబులున్
ఇర్వు రాశ్వినులుత్తమోత్తము లెన్ని చూడఁగ వెజ్జులన్." ౫౦

క. ఈవిధమున నొకటొకటిగ
నావాదమునన్ బ్రమోదశాంతముగ నిటుల్
వే వంది పలుకఁగా న
ష్టావక్రుఁడు యుక్తిఁ జెప్పి చతురతఁ గన్నన్. ౫౧

సీ. ఛిన్నవదనంబునన్ వంది క్రిందుమీఁదు
లరయఁగొడఁగను బైని మాటాడలేక
జయజయధ్వానముల్ నిండుసభఁ జెలంగ
జనకుఁ డెంతయుఁ గొనియాడె మునికుమారు. ౫౨

క. జలమజ్జితు లగువిప్రుల
వెలువడఁగ క్షణములోనఁ బితృపాదుల ని
మ్మైలఁ జూప వంది నింకన్
జలమజ్జితుఁ జేయ నతఁడు శాసించె నృపున్. ౫౩

గీ. వంది ముదమంది యెద నభినందనమున
మౌనిబాలకుఁ గొనియాడి మాననీయ
వరుణ యజ్ఞార్థమై విప్రవరుల నటులు
వరుణలోకంబునకుఁ బుచ్చుటరయఁ దెలిపె. ౫౪

మ. జనకుం డంతట నేకపాదుని సమర్చాపూర్వకప్రీతిఁ గో
కొనిరా నప్పుడు సభ్యు లెల్లరును వాగ్గుంభప్రియస్తోత్రవా
హిని ముంచెత్తిరి తండ్రిపుత్త్రులను నెంతే నేకపాదుండు వ
త్సను దాఁగౌఁగిట గ్రుచ్చి మూర్కొనియె బాష్పప్రస్తనేత్రాబ్జుఁడై.

గీ. రత్నఖచితాసనంబు లేర్పఱిచి భక్తి
సుతుని బితరుని నిలిపెను షోడశోప
చారములఁ బూజచేసెను జనకుఁ డంత
వేలుపులు మింటిపైఁ బుష్పవృష్టిఁ గురియ. ౫౬

క. కడుఁ బసిబిడ్డఁడు జననముఁ
బడయకముందే గ్రహించె బహువేదంబుల్
విడిపించెఁ దండ్రిచెఱ సుతుఁ
బడయంగా నేకపాదుభాగ్యం బెంతో! ౫౭

గీ. సముచితంబుగ నందఱ సాదరాను
కూలవాక్యంబులఁ వీడుకొని సుతుండు
తోడరా నేఁగె నేకపాదుండు జనక
దత్తబహుధనధాన్యముల్ తగ గ్రహించి. ౫౮

గీ. మార్గమధ్యంబునఁ ముని మాననీయ
బహుపవిత్రజలాకీర్ణ ప్రథమగణ్య
మగుసమంగానదిం గాంచి యందుఁ బుత్త్రు
మునిఁగి రమ్మని పంచి తాముందుఁ బోయె. ౫౯

క. అంగంబులు జలముల సోఁ
కంగఁ ముని మునిఁగి లేచి కాంచెను నిర్వ
క్రాంగంబుల నంగోద్భవు
నంగంబుల మించువాని నచ్చెరువడుచున్. ౬౦

గీ. తాతపాదునిసత్కృపాప్తత యతండు
మెచ్చి గృహమున కేఁగి యమృతముఁ ద్రాగి
నట్లు నందించుపితరుల నలరఁ జేసి
శుక్లపక్షక్షపాకరస్ఫూర్తిఁ దనరు. * ౬౧

---

* ఈకథ భారతవనపర్వము లోనిది. ౫౧ ప. నుండి ౬౧ ప. వఱకుఁ గలకథ ప్రథమ ముద్రణమున లేదు.

చ. దినదినవర్ధమానుఁడు నుదీర్ణగుణంబులఁ బ్రోవు సత్యవా
గ్జనితవిధేయసంపద నజస్రము శోభిలుచుండువాఁడు నై
జనకునియొద్ద సర్వగుణసంపద లంది వెలుంగుచుండ నా
తని నుపవీతిఁ జేసెఁ బిత తథ్యపు వేదవిదుండు గావునన్. ౬౨

గీ. పెరటిలో నున్న కల్పక మురుఫలంబు
లొసఁగఁ జాల దటన్న లోకోక్తి నెంచి
శుభముహూర్తమునందు శిష్యుం బొనర్చె
ఘనమునీంద్రున కొకని కాతనిని దండ్రి. ౬౩

చ. ముదుసలి జ్ఞాని యైనమునిపుంగవు నాతఁడు చేరి గౌరవా
స్పదముగఁ బూజ చేయుచు నుపక్రమణం బొనరించె శాస్త్రముల్
పదుగురు మౌనిబాలకులు భవ్యులు తోడుగఁ దద్రహస్యముల్
విదితము గాఁగ నిత్యము వివేకము సంస్మృతి విస్తరింపఁగన్.

గీ. ద్వాదశాబ్దంబు లాతని ప్రాయ మయ్యెఁ
దోడివారల నిత్యసంస్తుతులు గనుచు
బ్రహ్మతేజమ్ము వెదచల్లు బ్రహ్మచారి
వినయమునఁ గొల్చు నేవేళ విబుధు గురుని. ౬౫

సీ. నియతవేళోదితనిత్యసంధ్యావంద
నాగ్నిహోత్రాదుల నాచరించుఁ
బావనాత్మకలసత్ బ్రహ్మచర్యవ్రత
పాలనంబున దృష్టి వఱపుచుండు

గురుదేవసేవాగ్నిపరితప్తసౌవర్ణ
దివ్యదేహచ్ఛాయఁ దేజరిల్లు
నైకైకదీక్షాసకృద్ధర్మసూచక
యజ్ఞోపవీతసంప్రాప్తి వెలుఁగు
సమరవంద్యుఁ డష్టావక్రుఁ డరసి చూడ
శుకమహర్షియో లేక సంశుద్ధుఁ డైన
వామనకుమారుఁ డేమొ ప్రభావమంచు
ననఁగఁ దోఁచెడునట్టిపుణ్యాత్ముఁ డతఁడు. ౬౬

గీ. గురునిహృత్పద్మమును చూఱకొనె నతండు
వినయవిద్యావివేకవివృద్ధివలన
నతఁడు సుస్థిరవిజ్ఞత నందుకొనెను
గురుఁడు మనమున నిరతంబుఁ గోరుచుండు. ౬౭

శా. అష్టావక్రమునీంద్రనందనుఁడు సమ్యగ్భక్తిసంయుక్తుఁ డై
సాష్టాంగం బొనరించు సద్గురునకున్ సర్వంబుఁ దా నేర్చుచో
నిష్ఠావాప్తికినై గురుండుఁ బరమాధీనస్థితిం గన్న యా
శిష్టాచారపరాయణాత్ముని వటుశ్రేష్ఠు న్నుతించు న్మదిన్. ౬౮

చ. గురుపరిచర్యలో మఱి యకుంఠితసద్వ్రతఘోరదీక్షలోఁ
బరమదయావిశేషమునఁ బావనధర్మమహావ్రతంబులో
నరమర లేనియాతనిహృదంతర మెంతపవిత్ర మైనదో
యొరుల కెఱుంగరాక వెలయున్; [illegible]రావు కదా మహత్త్వముల్!

గీ. కామరోషాది దుష్టరాక్షసగణంబు
లతనిదీక్షాగ్ని కింధనతతిగ వేలె
నతనికడ నిల్వ లేక లోభాధముండు
దవ్వుదవ్వులకును బాన తరలిపోయె. ౭౦

గీ. శృంగములు కల్గువారలే చేర లేక
వే తొలఁగిపోయి రన నింక వేఱె పల్క-
వలయునే తక్క- దుష్టసంభవులమాట
నతఁడు శాసింప నేర్చె శత్రుతతి నెల్ల. ౭౧

సీ. తనజీవములు సర్వమును నొడ్డునే కాని
గురుసేవ లోపంబుఁ బరఁగనీఁడు
తన దేహమును దపోగ్నిని దహించునె కాని
కామరోషాదులఁ గ్రాఁగనీఁడు
తననాల్క- నిత్యసత్యమున నిల్పునె కాని
పరుషంబు లెన్నఁడుఁ బలుకనీఁడు
తనతపోధనవృద్ధిఁ దనరుచుండునెకాని
చీకాకు నశ్రద్ధఁ జేరనీఁడు

గీ. అతఁడు తినుటయు మనుటయు నతఁడు నిదుర
పోవుటయు నెవ్వ రెఱుఁగరు ముని యనంగ
నతఁడె యతనికి సాటిపుణ్యాత్ముఁ డతఁడె
యతనిఁ గొనియాడఁ దలఁచు టే యఘహరంబు. ౭౨

సీ. తనకంటె కెన్నఁడైనను మునికన్యకల్
  తగులుచోఁ బూజించుఁ దల్లులట్లు
తనదారి నెవరైనధన్యాత్ము లౌవృద్ధు
  లెదురైనచో వారిపదము లంటుఁ
దనబుద్ధి కెపుడైనఁ దగుకాంక్ష పొడముచోఁ
  బరమేశుకరుణయే పడయఁ గోరుఁ
దను నెవ్వరేఁ బొగడ్తలఁ బల్కు నట వీడి
  దవుదవ్వులకుఁ దాన తరలిపోవు

గీ. నతనిఁ బొడగాంచినంత బాహ్యప్రకృతియు
వివశయై యతనికి మహావినయమున వ
శీకృతం బగు నింక వశీకృతంబు
కానియది లేనియంతటిఘనుఁ డతండు. 23

సీ. గండుఁగోయిలమృదుకలకంఠమును బోలు
  సరణిని వేదంబుఁ జదువువేళఁ
జిలుకపల్కులఁ బోలుపలుకులఁ బలుకుచు
  గురుదేవుమదిఁ జూఱకొనెడివేళఁ
బరమపావనమైనభక్తిభావముతోడ
  శివసంస్తుతులు పెక్కు చేయువేళ
నమలినం బగునట్టియంతరంగమునందు
  గురుదేవుబోధ మూఁకొనెడివేళ

గీ. నజినదండంబు లొప్పఁగా భుజమునందు
నొసట భస్మముఁ జేతఁ జిన్ముద్రరక్ష
పట్టుగోఁచియు మౌంజి శుభంబు లొసఁగ
నలరు వేళలఁ గీర్తింతు రతని మునులు. ౭౪

చ. పరమదయాసముద్రుఁడు నపారతపోవిశాలుఁడైన జగ
ద్భరితయశోవిశాలుఁ డగుభవ్యగుణా [illegible]
గరము పఠించెఁ బావటుఁ డఖండముగా ఘనపదశాస్త్రముల్
గురుకృప కల్గెనేని సమకూరని దేది ధరాతలంబునన్ ! ౭౫

గీ. మేఘగంభీరనినదంబు మించ వేద
తతి నుదాత్తానుదాత్తస్వరితము లొప్ప
నెచటఁ దడఁబాటు భ్రంశము లేమి లేని
విధముగా నేర్చె బ్రహ్మ మెప్పింప నతఁడు. ౭౬

గీ. అతనిగురుభక్తి కచ్చెరువంది గురుఁడుఁ
గ్రమముగా శీఘ్రమునను సర్వమును నేర్పె
నేర్చె నాతండు సర్వంబు నిశ్చలముగ
గురుకటాక్షంబ యెల్లఁ జేకూర్చుఁగాదె ! ౭౭

గీ. గురుముఖంబున నేర్చుముఖ్యోపలబ్ధి
బ్రహ్మవిద్యాసమార్జనపాటవంబు
ననుపమాదర్శమైనవిద్యాభివృద్ధి
నంది చెన్నారె నాతఁ డత్యంతశక్తి. ౭౮

మ. తనసాన్నిధ్యమునందు నెప్పుడు నమందప్రీతిసంధాయకుం
డును నిత్యప్రియవాక్యసంపద నిరాటోపప్రభావుండు నై
తనవిద్యాపరిపూర్తిఁ గన్నమునిపుత్త్రశ్రేష్ఠుతోఁ బ్రీతిఁ దా
ననియెన్ మానికులావతంసుఁడు ననన్యప్రేమ సంధిల్లఁగన్. ౭౯

చ. "కఱచితి వెల్ల వేదములుఁ గాంచితి శాస్త్రమనీష నీ కిఁకం
గఱపఁగ నే నశక్తుఁడను గావున నీవు గృహస్థధర్మమం
దఱమఱ లేకయుండుటకు నర్హుఁడ వైతివి సద్గృహస్థువై
వఱలుము నీదువర్తనము వాసిలు నింక జగత్ప్రసిద్ధమై. ౮౦

చ. అరయుము వైదికంబు లగునార్యమహోన్నతధర్మసంపదల్
పరిగణియింపు నిత్యశుచి బాంధవకోటికిఁ దృప్తికూర్పు మా
దరమునఁ బైతృకంబులును దైవఋణంబులుఁ దీర్చుచుండి నీ
వరయఁగ రమ్ము ధర్మపరమార్థము సంశయ మైనవేళలన్. ౮౧

గీ. ఆశ్రమములందు సద్గృహస్థాశ్రమంబె
శ్రేష్ఠ మని యంద్రు బుధులు విశేష మరసి
సద్గృహస్థులు లేనిదేశమ్ము వమ్ము
సద్గృహస్థులు కలుగు దేశమ్ము సొమ్ము. ౮౨

శా. ఏదేశంబున సద్గృహస్థనివహం బీశార్పితస్వాంత మై
వేదాభ్యాసిపటూత్తమోత్తముల కేవేళన్ సదాధార మై
నాదబ్రహ్మసుఖాత్మలోలగురుసన్న్యాసాంచితస్థాన మై
మోదాంభోనిధిఁ దేలుచుండు నదియే ముక్తీశ్వరస్థానమా. ౮౩

గీ. అత్రిగౌతమభృగువసిష్ఠాదు లెల్ల
రమలధర్మాకరము గృహస్థాశ్రమంబె
యాశ్రయించి వెలింగి; రయ్యది గ్రహింపు
వారె యాదర్శ పూరుషు లెప్పటికి మనకు." ౭౪

చ. అని గురువర్యుఁ డన్న వినయంబునఁ బాదతలంబు ముట్టుచుం
గనుఁగొనలందు బాష్పములు గ్రమ్మఁగ ధైర్యమహాధనంబుచే
ననుపకాంతితో నలయనాననపద్మము వంచి మెల్లఁగా
నను గురుదేవుతోడ వినయంబు భయంబును భక్తి మించఁగన్.

చ. "ఇరవుగ లోకవర్తన మొకింత యెఱుంగ గురూత్తమాంఘ్రివం
కరుహవిశేషదాస్య మది కాక తదన్యము నట్టి నన్ను మీ
రరయ కెఱింగి పంపనగునా కడుదుష్కరగేహధర్మ భీ
కరపథవర్తనంబునకుఁ గాంచరె మామకరక్షణీయతన్." ౭౫

గీ. అని పలుకుశిష్యు గురుఁడు ప్రేమార్ద్రదృష్టిఁ
గాంచి "వత్స! నే నెఱుఁగనా? కార్య మిదియ?
యగు నమోఘంబు నాదువాక్యంబు వినుము
పాటఁ జూడకు మెపుడుఁ బెద్దల" నటన్న. ౭౬

గీ. "మీవచ స్సమోఘంబు క్షమింపుఁ డేను
దెలియ కంటిని గొన్ని సందేహకరము
లైనవాక్యముల్; మీరలే యానతిండు
తగినకన్నియ యెవతె యుద్వాహమునకు. ౭౭

గీ. గురునియానతి దాఁటుమూర్ఖుఁడను గాను
మీకటాక్షసుధారసామేయశక్తి
నిర్విచారుఁడనై యుందు నిశ్చయముగఁ
దెలియఁ జెప్పుఁడు నేఁ జేయఁగలది దేవ!" ౮౯

చ. అనవుడు నొక్కసారి హృదయంబున దృష్టి నిగుడ్చి వెంటనే
మునివరుఁ డిట్లు పల్కె ననుమోదముతోఁ "ప్రియశిష్య! వత్స! పా
వనుఁడవు నీవు నీకుఁ దగువాఁడు వదాన్యుఁడు నామహామునీ
శునిసుకుమారి సుప్రభ యశోమయి నీకతగుం గుమారకా!

గీ. ఆమునీంద్రునికడ కేఁగి యభిమతంబుఁ
దెలియఁ జెప్పుము నాదుపల్కులుగ
నాతఁడును నిన్ను గ్రహియింప ననుమతించుఁ
బోయి రమ్మిఁక శుభములు పొందు" దనిన. ౯౧

గీ. గురునిపాదంబులకు భక్తిపరత నెఱఁగి
దీవెనల నంది కోర్కె సిద్ధించుకొఱకు
బయలుదేఱె నష్టావక్రవటువరుండు
నావదాన్యునియాశ్రమోపాంత మరయ. ౯౨

గీ. రాత్రిభాగంబునను గురురత్నముకడ
శిక్షఁ బడయుచు నజ్ఞాతసేవ చేసి
పద్మినీకాంతహృదయంబుఁ బట్టి వచ్చు
బాలభానునిరీతి నొప్పారె నతఁడు. ౯3

గీ. కోరకంబుగఁ గాలంబుఁ గొంత కడపి
నవనవస్ఫూర్తి భాసమానమ్ము గాఁగ
నభ్యుదయ మందుకుసుమము ననుసరించె
నావటూత్తముబ్రహ్మచర్యప్రదీప్తి. ౯౪

గీ. కడపవలసినజీవితకాలమందు
నాదిమం బగుబ్రహ్మచర్యాశ్రమంబుఁ
గడపి యాతఁడు గార్హస్థ్యకలనఁ దనర
నావదాన్యునిఁ గాంచంగ నరుగునపుడు. ౯౫

ఉ. అందము మీఱ వీచె మలయాచలనవ్యసమీరపోతముల్
మందము మందమై ముని యమందసుఖానుభవంబు నంది యా
నందము నంద శ్రావ్యశుకనాదము తోఁచెను స్వస్తివాక్యమై
ముందర వచ్చు పెండ్లి మునుముందర నే గ్రహియించినట్టులై.

క. ఇరువురుబుుషికన్యక లం
బురుహానిభాననలు నవ్యఫుల్లాబ్జంబుల్
కరసరసిజముల మెఱయఁగ
నరుదెంచుచు నెదురువచ్చి రావటుమణికిన్. ౯౭

చ. శుభశకునంబు నూఁతగొని స్తోత్రకదంబము చే గురూత్తముం
డభిముఖుఁడై న సంతసము నందుచు మిత్త్రుల వీడుకొల్పి ప్రా
న్నభమున దేవదేవు శరణంబని రక్షకుఁజేసి మారస,న్నిభుఁడు
వటూత్తముండు పయనించె వదాన్యగృహోపభూమికిన్. ౯౮

గీ. అతని యెడఁబాటు నోర్వలే కచట గురుఁడు
"నిట్టివి గదయ్య! బంధమ్ము లెవనికైనఁ
జూచి యెఱుఁగ నే నిట్టిశిష్యుఁ ధరిత్రి"
ననుచుఁ జెప్పంగఁ దొడఁగె శిష్యాళితోడ. ౯౯

గీ. నవనవోన్మేషయౌవనానంద మవనిఁ
బరవశునిఁ జేసి ముప్పతిప్పలను బెట్ట
దెవనిపాండిత్య మది గర్వ మీకయుండు
నతనిభాగ్యముఁ గొనియాడ నలవి యగునె ౧౦౦

గీ. అతఁడు పొడగాంచవలసినయావదాన్యుఁ
డనుపమానతపశ్శాలి యద్వితీయ
గార్హ్యధర్మప్రపాలనాగౌరవుండు
నాత్మతత్త్వజ్ఞుఁ డైనపుణ్యప్రభుండు. ౧౦౧

గీ. పరిసరారణ్యభూమి నివాస ముండు
లక్షణాన్వితయైనయిల్లాలితోడ
సుప్రభానామలసిత యాసుతను గాంచి
యుత్తమాదర్శజీవితవృత్తి నతఁడు. ౧౦౨

గీ. ఆయరుంధతితో ననసూయతోడ
నతివ పోలు నటన్నఁగా దతిశయోక్తి
సుగుణపుంజంబు పతిమతిఁ జూఱకొన్న
ధర్మదేవత యగును వదాన్యభార్య. ౧౦౩

గీ. కమ్మతావుల నీను నెత్తమ్మిఁ బోలు
స్వచ్ఛశారదపూర్ణిమాచంద్రుఁ బోలు
ముఖవిలాసముఁ గల్గినముత్తియంబు
సుప్రభాకన్య సౌందర్యశోభితాంగి.   ౧౦౪

చ. జనకునిపాదపద్మము లజస్రముఁ గొల్చుచు భక్తియుక్తి నా
తనికి సపర్య లెల్ల సతతంబు నొనర్చుచు మాతృదేవికిన్
వినయవిధేయతాన్వితవివేకగుణంబునఁ బ్రీతిఁ గూర్చుచున్
మనమలరంగఁ జేయుచు నుమాసతి సుప్రభ కొల్చు నెప్పుడున్.

గీ. అతిథు లేతేర నర్ఘ్యపాద్యంబు లిచ్చు
మాననీయులపాదపద్మములు గొల్చుఁ
బుణ్యసాధ్వీలపూజ లెప్పుడును జేయు
సుప్రభాకన్య యాజన్మసుగుణ యగుచు.   ౧౦౬

చ. పదిపదునాల్గువర్షములప్రాయము వచ్చియు రాకమున్నె సం
పద లన నెట్టివో పరమమాన్యపదంబు గ్రహించు టెట్టులో
సదమలమైనసంసరణసాగరనిస్తరణాతిసౌఖ్య మె, ట్లొదవునో
యన్నప్రశ్నములకుత్తరముల్ గ్రహియించె నామెయున్.

సీ. పరమేశ్వరుని దైవప్రతిబింబమే భర్త
పడఁతి భజింపంగవలయుఁ బతిని
సకలసంపదలకు నాలవాలము భర్త
పడఁతి భజింపంగవలయుఁ బతిని

నుభయవంశోద్ధారుఁ డుత్తముం డగుభర్త
పడఁతి భజింపంగవలయుఁ బతిని
నైహికాముష్మికాద్యఖిలప్రదుఁడు భర్త
పడఁతి భజింపంగవలయుఁ బతిని

గీ. నట్టిపతిదైవ మెట్టి యిక్కట్టులందు
మాననీయుఁడు త్రాతయు మహితవిభవ
శోభితుం డనువిశ్వాసశోభ నంది
సుప్రభాకన్య వెలయు సంస్తుత్య యగుచు. ౧౦౮

క. జననీజనకులసుభద
ర్శనమున మేల్కాంచి వారిశశ్వద్బోధం
బును శిరమున ధరియించుచుఁ
గను నామోదంబు జనిని గాంచినఫలమున్. ౧౦౯

గీ. తల్లిదండ్రులు కడపునాదర్శజీవ
నంబు నంతర్బహిరరాతినాశనంబు
నాత్మవిద్యానపేతసౌఖ్యానుభూతి
నాకళించెను సుప్రభ యన్ను మిన్న. ౧౧౦

గీ. ఆవదాన్యునియాశ్రమప్రాంగణమున
కరుగుదెంచి యష్టావక్రుఁ డరయ నచట
జనకునానతి భక్తిఁ బుష్పములు కోయు
సుప్రభాకన్య కనరాఁగఁ జోద్య మందె. ౧౧౧

గీ. కొమ్మ కొమ్మను వంచి సుమమ్ముఁ గోయఁ
గొమ్మలం దొక్కకొమ్మయై కొమ్మ తోఁచె
సుమముఁ గోయఁగ నెంచునాయువ కరంబు
నమలమార్దవవిఖ్యాతసుమముఁ బోలె. ౧౧౨

గీ. ప్రసవమును గోయునట్టిసుప్రభకరంబు
తనదుహృత్పద్మమును గోసి తనరునట్లు
తోఁచె నాబ్రహ్మచారి కస్తోక మైన
యతని తేజంబుఁ గాంచి యాయువయు నంత. ౧౧౩

ఉ. "కంటిని మౌనిబాలకులఁ గాంచనసన్నిభదివ్యదేహులన్
మంటిని వారిసోదరి ననం దగి తొల్లి యనేకవేళ లే
నుంటి నతిప్రియంబున నోహో! యితఁ డేల కలంచె నామనం
బొంటి నిటుండ" నన్నతనయామహాలతోఁ జని చెప్పెఁ దండ్రికిన్.

గీ. దవ్వుననె వానిఁ గాంచి వదాన్యుఁ డెల్ల
నాత్మగతమున నెఱిఁగి యాహ్లాద మంది
యర్ఘ్యపాద్యమ్ము లిమ్మని యనిపెఁ గూఁతు
సుప్రభాకన్య నది శుభసూచకముగ. ౧౧౪

గీ. మునికుమారునిరాక సమ్మోద మొసఁగ
నతనిఁ గూర్చుండఁ జేసి యత్యాదరమునఁ
" జదువుసంజలు సాగునే సక్రమముగ
గురులు సేమమే ?" యని వారికుశల మడిగె. ౧౧౫

ఉ. అంతట సిగ్గుదొంతరలె యాభరణంబులుగా వివేకముం
శాంతము భక్తియుం దనవశంబులు గాఁగ హృదంతరంబునం
దెంతయుఁ బూజ్యభావమె యహీనవిలాసము గాఁగ సుప్రభా
కాంత యొసంగె భక్తిఁ దమకంబున నాతని కర్ఘ్యపాద్యముల్.

గీ. ఆదరంబునఁ గైకొని యావటుండు
"శీఘ్రమేవ వివాహసంసిద్ధి రస్తు"
టంచు దీవింప నలరె నాయమయు లోన
నావదాన్యుఁడు ముదమందె నది యెఱింగి. ౧౧౮

ఉ. "పావన మయ్యె మాగృహము పావన మైనత్త్వదీయపాదసం
భావన నోవటూత్తమ! శుభంబులె మాకిఁకఁ గల్గు నెప్పుడుం
నీవు మహావ్రతస్థుఁడవు నిక్కము మామకపూర్వపుణ్యమే
నీ విట రాఁగతం బగుట నిశ్చయ మింతయు నే నెఱుంగుదుం.

చ. వయసునఁ జిన్నవాఁడవు ప్రభావమునం గడుఁ బెద్ద విందు సం
శయ మది లేదు నే నెఱుఁగఁ జాలితి మీఁగురుదేవునొద్ద నీ
నయమును భక్తియుం భయము నమ్రతయున్ వటువర్య! నీదురా
కయె పదివేలు చేయఁ గల కార్యము చెప్పు మసంశయంబుగన్."

గీ. అని వదాన్యుఁడు పలుక నానంత మైన
స్తుతికి గర్వంబు నొందక స్తోక మైన
వినయము వివేకమును భక్తి విశదపడఁగఁ
బలికె నిట్లు వదాన్యుతోఁ బ్రస్ఫుటముగ. ౧౨౧

శా. "ఆశీర్వాదము నంద మీకడను నే నర్హుండనే కాని మీ
వైశిష్ట్యస్తుతి కెంతమాత్రమును నేఁ బాత్రుండఁ గా నింక స
ర్వాశామోహవిలోభబంధురమహాపాశచ్ఛిదానందులౌ
సౌశీల్యప్రభు లట్టిమీపదనఖాంశం బేను బోలం గదా! ౧౨౨

గీ. ఇంత కస్మద్గురూత్తము లిట్లు పల్కి
మనిరి తమతోడ నుత్సాహ మతిశయిల్లఁ
'బ్రభల నీ నెమమీదుసుప్రభ నితనికిఁ
బరిణయంబుగ నీయ నా ప్రార్థనంబు. ౧౨౩

గీ. మీఁదుమిక్కిలి యోజించి మేలు సేయుఁ'
డనిరి దీని విచారించి యభిమతంబుఁ
దెలియఁ జెప్పిన నేఁ బోయి తెలియఁ జెప్ప
నస్మదీయగురూత్తముసభిమతంబు." ౧౨౪

చ. పలుకుటయుఁ వదాన్యుఁ డతిభవ్యచరిత్రుఁడు సంతసంబుతో
నలఁతియె సద్గృహస్థునిగృహాంగణభూమికి నేఁగుదెంచి పూ
జ్యులకును బూజ్యుఁడైనపురుషోత్తముఁ డిట్లు తనూజఁ గోరి రాఁ
గలదె మఱొక్కభాగ్య మని కౌతుక మందుచు వాని కిట్లనున్.

ఉ. "నీవును బ్రహ్మచారివి వినీతుఁడ వెల్లగుణంబులందు సం
భావితపుణ్యమూర్తివి శుభాకర! నీకును మాదుసుప్రభా
దేవికి నీడుజోడు మఱి దివ్యగుణంబుల సామ్య మౌను శ్రీ
భావహ మిద్ది కాని వినుమా మదభీష్టము పాటిసేయఁగన్."

క. అన విని యష్టావక్రుఁడు
మనమున సందేహరహితమానితశాంతిన్
వినయమునఁ బల్కె నిట్లని
"పనిగాని యెడఁ దెల్పఁ డెంతపని యైన నీకన్." ౧౨౭

చ. అనిన వదాన్యుఁ డిట్లనియె నంత "నుదీచ్యపథంబు నీవు ప
ట్టిన నది పోవు నొక్క ప్రకటీకృతదివ్యసుగంధపూరకా
ననమున కద్ది దాఁటి చనినన్ విను మొక్కపురాధిరాజ మిం
పున విలసిల్లు నద్దియె ప్రభుం డగునట్టిధనేశుప్రోలు నై.

ఆ. ధనదుపురము దాఁటి ధర్మాటవిం దాఁటి
పోవఁ బోవ వచ్చుఁ బురవరములు
వాని దాఁటి పోవ వచ్చును గిరు లింక
నరిగి పిదపఁ గను హిమాలయంబు. ౧౨౯

చ. పరమపవిత్ర మాగిరి ప్రభావమునం గడుమిన్న పూర్వ మా
గిరితటపుణ్యభూమిని మృగేక్షణ యాగిరికన్య యీశ్వరున్
వరునిగఁ గోరి చేసిన దవారితసద్వ్రతదీక్ష నాతఁడున్
బరమదయాళుఁడై పరమపావని యాగిరికన్యఁ గైకొనెన్. ౧౩౦

చ. అదియునుగాక యానగమహత్త్వ మనంత మనూహ్య మందు సం
పదల విరాజిలున్ బ్రమథభవ్యగణంబులు క్రీడసల్పుచున్
ముదమును బొందుఁ బార్వతి ప్రమోదము నందు మృడుండు భక్తిన
య్యదన మునీశ్వరుల్ నిజహృదంబుజముల్ వికసింపఁ గాంతురున్.

గీ. అపవిత్రప్రదేశమాహాత్మ్య మరసి
గిరిజ సేవించి మృడుని సుగీతవితతిఁ
గీర్తనముచేసి యొక్కముహూర్త మాఁగి
కడచి చన నొక్కచో నీపకాననంబు. ౧౩౨

క. కన్నులకును బండుగ యై
యన్నులకును బ్రియసమాగమావాసం బై
చెన్నొందవు నట్టికానన
మెన్నం గనఁ జాల మెట్టియెడలన్ జగతిన్. ౧౩౩

గీ. ఆవనాంతరనగరంబు నాశ్రయించి
దివ్యతేజఃప్రభావసద్విభవ మంది
యువతి యొక్కతె పుణ్యాత్మ యుండు నామెఁ
గాంచి వచ్చిన దీరు నాకాంక్ష లెల్ల. ౧౩౪

క. వచ్చినవెంటనె నీకును
నిచ్చెద సుప్రభను బరమహృష్టాత్ముఁడ నై
నచ్చినవరుఁడవు నీ వని
మెచ్చును సుప్రభయు నింక మే లగు నీకున్. ౧౩౫

క. అని యేర్పరించి పలికిన
విని యష్టావక్రుఁ డంత వినయానతుఁ డై
"కని వత్తుఁ బోయి వచ్చెద
ననుమానము లే" దటంచు నరిగెన్ వేగన్. ౧౩౬

ఆశ్వాసాంతము.

ఉ. ఉత్తమభక్తలోకపరమోత్తమ ! సద్గురుదేవ ! తావకీ
నోత్తమపాదపద్మసరసోత్తమసేవ ననుగ్రహింపు మో
యుత్తమయోగివంద్య ! పురుషోత్తమభక్తవతంస ! సర్వలో
కోత్తరదివ్యతేజ! పరమోత్తమభావ! జగత్ప్రభూత్తమా! ౧౩౭

పంచచామరము :

సురాధినాధు లెన్న లేనిశుద్ధసత్త్వసంపదన్
విరాజమానదివ్యకీర్తివిశ్రుతప్రభావుఁడా !
కరావలంబమై మదీయకాంక్షఁ దీర్చి త్వద్దయా
సురాపగాజలంబులందుఁ జొక్కఁ జేయు సద్గురూ ! ౧౩౮

గద్యము. ఇది పరమేశ్వరస్వరూపగురుకటాక్షలబ్ధకవిత్వ గౌతమ
సగోత్రపవిత్ర వేంకటేశ్వరపౌత్త్రాన్నపూర్ణాంబా వేంకట
సుబ్రహ్మణ్యేశ్వరచతుర్థపుత్త్ర బులుసు వేంకటే
శ్వరప్రణీతాష్టావక్రచరిత్రమునందుఁ
బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# ష్టావకచరితము

## ద్వితీయాశ్వాసము.

శ్రీజేత! ముక్తిలక్ష్మీ
రాజితమహిమాభిరామ! రమ్యాకారా!
తేజస్సంపత్ప్రద! గురు
రాజేంద్రా! పరమపురుష! రక్షాదక్షా! ౧

వ. అన విని "దేవా! యజాతశత్రుండు
'పిమ్మట నష్టావక్రుం డెట
కేఁగె నేమి చేసె' ననుటయు
భీష్ముం డిట్లని చెప్పఁదొడంగె. ౨

చ. చని చని కాంచె నాతఁడు విశాలతటాంతరసర్వకాలపా
వనజలసంయుతంబు సురవంద్యసుఖాస్పదదివ్యవీచికా
నినదవిరాజితంబు నతినిర్మలశాంతివిభాసితంబు స
న్మునిగణసేవితంబు ఘనమోహహరం బగుబాహుదానదిన్. 3

చ. చలదురువీచికాచయము శాంతసుఖప్రదమై సదా మనం
బలరఁగఁ జేయ సందలిమహత్త్వసుఖంబును జూచికొంచు భూ
తలమున నున్నపచ్చనగుతావులు మోదము నిస్మడింపఁగా
సలలితమానసంబు వివశంబుగ నిల్చె నతండు నాఁటికిన్. ౪

గీ. బాహుదాతీరభూభాగవర్తి యగుచు
బాహుదానీరములఁ గ్రుంకి పరమహర్ష
జలధి నోలాడి మునివంశతిలకుఁ డంతఁ
బోవఁ దొడఁగె ధనాధీశుప్రోలివైపు. ౫౫

చ. నిరతము బ్రహ్మచర్యఘననిష్ఠఁ బ్రిశుద్ధిగ నిల్పి యుంట స
ద్గురుపదసేవయుం నిగమఘోష త్రికాలము నుండియుంట నీ
శ్వరుని మనంబునందు నతిభక్తి వశీకృతుఁ జేసికొంట నా గ్రగ్రా
పరమమునీంద్రుఁ బ్రత్యణువు బ్రహ్మమయంబుగఁ దోఁచుచుండఁ

గీ. బాలరవి రంజనాంశువుల్ పఱపునట్లు
బాలముని బ్రహ్మదీప్తులఁ బఱపుచుండె
భాస్కరకరంబు తీక్ష్ణతఁ బడయుఁ గాని
బ్రహ్మతేజంబు శాశ్వతప్రమదకరము. ౭

చ. ధనదుని మున్నెఱింగినకతంబున నాతనిప్రోలుఁ జూడఁగాఁ
గనుట శుభప్రదం బని సుఖంబుగఁ బోవుచు నుండ దవ్వునం
ధనదుఁడు వానిరాకను బ్రధానులు చెప్ప నెఱింగి వెంటనే
తనదువిమానముం గొని ముదంబున వచ్చె మునీశుపాలికిన్. ౮

ఉ. మచ్చికమీఱఁ దోడనె విమానము డిగ్గి యథోచితంబుగా
వచ్చి నమస్కరించి మునివంశవరిష్ఠునిఁ గౌఁగిలించి "యో
సచ్చరితా! కృతార్థుఁడ విశాలయశోధన! నాదువీటికిం
వచ్చితి నీవు మత్ప్రబలభాగ్యపరంపరకుం ఫలంబవై ౯

గీ. స్వాగతము స్వామి! హృదయపూర్వాభివంద
నము లధివసింపు మీవిమానంబుఁ గరుణ
నధివసించి గృహంబున కరిగి యచట
బడలికలువాయ మాటాడవచ్చుఁ బిదప." ౧౦

క. అని వేఁడుకొనియె నాతని
మన మెఱిఁగినయావటుండు మాటాడక యా
తనికోర్కిఁ దీర్పఁ ద్రిభువన
వినుతంబుగ వాహనోపవిష్టుం డగుటన్. ౧౧

క. కను మూసి తెఱచునంతనె
వినువీథిని వచ్చి చేరె విద్యుద్వేగం
బున నావిమానరాజము
ధనపతిపురజనులు గాంచి ధన్యులు కాఁగన్. ౧౨

చ. అది యలకాపురంబు పరమాద్భుతదృశ్యవిరాజితంబు సం
పదలకు మూలమున్ నిఖిలభాగ్యసుఖాస్పదపుణ్యభూమి భో
గదమహిళాజనంబులకు ఖ్యాతి గడించిన చోటు నిత్యస
మ్మదమున యక్షకింపురుష ముఖ్యులు వేడుకఁగూడు తావునన్.

సీ. ఏవంకఁ జూచిన నింద్రనీలవినూత్న
సంస్థాపితం బైనసౌధచయము
లేదిక్కుఁ గాంచిన మేదురమధుమాస
భాసురప్రభ లీనుప్రకృతిశోభ

లేకడఁ బొడగన్నఁ బ్రాకటసౌందర్య
రాజితం బైనయీ రామవాటు
లేదెన నెంచిన నిసుమడించినపరీ
మళమంజులమలయమారుతములు

గీ. దివ్యగాయనీగాయకశ్రావ్యమధుర
గానలహరీప్రసిద్ధశృంగారబహుళ
రసనమాకృష్టమోహావిరాజమాన
భోగనారీవిలాసవిస్ఫూర్తి వెలయు. ౧౪

ఉ. అందలిదివ్యసౌధములయందుఁ బ్రసిద్ధికి నెక్కి యెంతయున్
సుందరమైనసౌధమును శోభితనవ్యవిలాసినీజనా
నందనిధాన మొక్కటి సనాతనమానివిహారవాసస
న్మందిరమున్ బొనర్చెను ధనాధిపుఁడేమి మదిన్ దలంచెనో.

శా. ఆసౌధంబున దివ్యదేహముల నాహ్వానించెఁ గాంతాజనం
బాసౌందర్యనిధానమున్ ఘనతపస్స్వాధ్యాయవిద్యానిధిన్
వీసంబైనఁ జలింపఁ జాలఁడు మహావిద్యానిరూఢస్థితిన్
గాసంబైనఁ గదల్పఁ జాలరుగదా! గాఢవ్రతుం గామినుల్.

శా. అష్టావక్రమునినిష్ఠ మున్వినె ధనాధ్యక్షుండు సంప్రీతి నా
విష్టుండైనగురూత్తముండు పలుకన్ విన్నంతనే పోక తా
నష్టావక్రుఁ బరీక్షచేయువల నత్యంతంబుఁ గాంక్షించె న
య్యష్టావక్రుఁ డెఱుంగఁ డీవిషయ మీర్ష్యాగ్రస్తచిత్తమున్.

ఉ. ఇయ్యదికారణంబుగ ధనేంద్రుఁడు వారవధూజనంబుతో
నెయ్యము మీఱ నెంతయును నేర్పునఁ జెప్పి ముదంబు మీఱ "నో
తొయ్యలులార! మీ రతనితోడఁ జరించి జయింపుఁ"డంచుఁ దాఁ
దియ్యగఁ బల్కి సర్వము మదిన్ దలపోసె జయింప నాతనిన్.

గీ. ఈపరీక్ష నష్టావక్రుఁడే జయింప
నగును సంతస మాతనియాత్మనిష్ఠ
కతఁడు జితుఁడైన నానంద మగును దనకు
నభిమతము తీరు నని ధని యాత్మఁ దలఁచె. ౧౯

గీ. ధనదుఁ డాతని భక్తిఁ బ్రార్థనము చేసె
నొక్కవత్సర మాఁగి యం దుండుటకును
నాతఁడును నాత్మపరిశీలనార్థ మచట
ననుమతించె వసింపఁ బ్రియమ్ము గదుర. ౨౦

గీ. దినదినంబును రంభాదిదివిజవనిత
లాటపాటల వివిధవిద్యావినోద
కృతుల నలరింప వలపింప నించుకైన
నతఁడు చలియింపఁ డాత్మవిద్యానిరూఢి. ౨౧

సీ. ఊర్వశీరంభాతిలోత్తమాద్యప్సరో
మానినీగణకలగానలహరి
యక్షగంధర్వసిద్ధైహికసుఖభోగ
దైశ్వర్యమదమహాహర్షధార

ఘననిధిప్రఖ్యాతధననాథవిభవపు
ష్పకరాజగర్వప్రశస్తవృష్టి
యాకాశచుంబితాత్యంతాభిరమణీయ
సౌధశిలాకాంతిసముదయంబుఁ

గీ. బొంగి పొరలియు నాతనిఁ గ్రుంగఁ జేయఁ
జాలకయు బడబాగ్నితో సరియె యైన
అతనితీక్ష్ణతపఃప్రభావానలమును
దాఁకఁ జాలక వెలవెల్లఁదనము గనును.

గీ. ధనదుప్రోలున నుండి గంధర్వయక్ష
సిద్ధసాధ్యులతోడను జెలిమి కలిగి
రంభ మొదలైనయప్సరోరామలకడఁ
జలనరహితుఁడై యతఁడు వత్సరముఁ గడపె.

సీ. ఉదయకాలీనవిధ్యుక్తసంధ్యావంద
నాగ్నిహోత్రాదుల నాచరించు
స్వాధ్యాయనాత్యంతసక్తచిత్తముతోడఁ
బరమేశుపదములఁ బ్రస్తుతించు
మాధ్యాహ్నికోచితమంత్రతంత్రనిరూఢి
నిత్యకర్మకలాపనియతి జరపు
నమృతోపమానభక్ష్యాన్నపానీయముల్
తగుకొలందిగఁ దృప్తిఁ దా భుజించు

గీ. సమయమఁ దోఁతెంచువారలనడత లెఱిఁగి
యుచితరీతుల భాషించు నచలుఁ డగుచు
నతులితాదర్శజీవితవ్రతము నడపు
నిత్యమును నిష్ఠతోడుత నిర్మలముగ. ౨౪

చ. మలినవిదూరమై యతనిమానసబంభర మెల్లవేళలన్
సలలితనూత్నపద్మరుచిసంపదఁ బొంపిరివోవునీశ్వరాం
ఘ్రులపయి వ్రాలియుంట నితరోన్నతవస్తువు లొల్ల కెన్నఁడున్
జలనవిహీనమై నిలువ సాగు మహేశపదాంబుజంబులన్. ౨౫

గీ. పరమపావనహృదయషట్పదము వ్రాలి
మృడపదాంబుజవిలసితామృతముఁ గ్రోల
నెచట నుండిన నేమి దేహేంద్రియములు
తనశరీరమె మఱచు తత్త్వజ్ఞమణికి. ౨౬

గీ. బ్రహ్మచర్యాశ్రమోక్తజీవనమునందు
నాత్మసంయమనమ్ము ననాత్మవిధము
నాచరణపూర్వకంబుగ నభ్యసించి
నట్టివటుదృష్టి పోవునే యట్టు నిట్టు. ౨౭

గీ. ఆత్మపరిశీలనార్థమై యచటఁ గడపి
తాను గాంచినవిజయసందర్శమున
నాత్మఁ బొంగె నష్టావక్రయమివరుండు
సంతసం బందె ధనియు మచ్చరము డింద. ౨౮

గీ. అంత నొకనాఁడు ధనదుఁ డత్యంతభక్తి
వచ్చి కూర్చుండి యాతనివాంఛ యడిగి
"తెలియఁ జెప్పఁడు తీర్తు నేవలపునైన"
ననుచుఁ బ్రార్థించె నందన మాచరించి. ౨౯

చ. "వనములఁ గాయగూరలను వాంఛలు లేక క్షుధార్తిఁబాపుకోఁ
దినుటయు నిత్యమున్ ఘనవిధేయతతోఁ బరమేశుఁ గొల్చుటల్
మనము కలంక దేఱఁ బరమంబును గాంచుట వృత్తి యైనమా
కనభిమతంబ కాదె! యెదియైనఁ దదన్యపదార్థజాలమున్. ౩౦

ఉ. కావున నెద్దియున్ వలదు కామ్యము; కాని సుఖాబ్ధిఁ దేలితిన్
నీ వొనరించినాఁడవు వినిర్మలబుద్ధి ననేకసత్క్రియల్
భావమునం దలంచెదను భద్రము నీకగు నంచు నిత్యమున్
బోవఁగఁజూడు మింక ననుఁ బుణ్యము నీకగుఁ బోయివచ్చెదన్."

చ. అనినఁ గుబేరుఁ డంత వినయంబునఁ బల్కె "మహీసురోత్తమా!
యనవరతంబుఁ ద్వాదృశు లహమ్మతినిర్మథనప్రవీణు లిం
పునఁ గడుసన్నిధానమునఁ బూజల నంద మదీయభాగ్య మే
మని కొనియాడఁ జాలుదు మహాత్మ! తదన్యము కోరుకొందు నే?

గీ. పలుకఁజాలను మీదుపల్కులకు నెదురు
కాని యిఁక నొకవత్సరకాల మాఁగ
వేఁడెద" నటంచుఁ బల్కుకుబేరుఁ జూచి
పోవలయుఁ దప్ప" దని పల్కె నావటుండు ౩౩

చ. అనఁగఁ గుబేరుఁ డంత వినయంబున లేచి మహీసురోత్తముల్
దనపరిచారబృందములఁ దత్పరతం జనుదేరఁ బంచి యా
తనివెనువెంట నేఁగెఁ దనతథ్యపుభక్తినిఁ దెల్ప నాతఁడుం
బనిగొను మంచుఁ బుచ్చి తనమార్గముఁ బట్టె హిమాద్రిచెంతకున్.

గీ. వయసు చూడఁగ నడిమియౌవనము కాని
యన్య మది కాదు రంభాదికాప్సరసలఁ
జూడ నొల్లఁడు కన్నెత్తి, చూచు నాత్మ
ననుచుఁ బొగడుచు ధనదుండు నరిగెఁ బురికి. 31

మ. హిమశైలస్థలవాసులన్ సతతసర్వేశార్పితస్వాంతులన్
గమనీయప్రతిభాప్రభావు లగుభక్తశ్రేష్ఠులం గాంచునా
సుముహూర్తంబుల నెంచుచున్ బ్రతిపదస్తోత్రప్రహృష్టాత్ముఁడై
హిమశైలంపుసమీపభూములకుఁ బోయెన్ మౌని వెన్వెంటనే.

క. హిమవంతుఁడు హిమతనయయు
హిమవంతునియల్లుఁడైనయీశ్వరుఁడును నా
హిమకరుఁడు నెల్లవారలు
సమయంబున జ్ఞప్తి రాఁగ సంభావించెన్. 32

చ. అచటఁ దపోవ్రతంబున ననంతసుఖాస్పదపుణ్యమూర్తులై
యచలితభక్తియోగమున నాశ్రితవత్సలుఁ బార్వతీశు నెం
చుచు హృదయాంబుజంబుల వచోవిభవాతిశయంబులన్ స్తుతిం
చుచు వసియించువారలను జూచి ప్రమోదము సంఘటిల్లఁగన్.

క. అష్టావక్రుఁడు భక్త్యా
విష్టుం డయి సన్మునీంద్రవితతిని గని తా
నిష్టావాప్తికి వారికి
సాష్టాంగము చేసి చనును శశ్వత్ప్రీతిన్. ౩౯

గీ. అతఁడు చని కాంచె నంత మహాప్రశస్త
మఖిలనగరాజ మైనహిమాద్రిరాజ
మధికపుణ్యంబునం గాని యబ్బ దనుచుఁ
జూడఁ దలపోయ వినుతింప జాడఁ దెలియ. ౪౦

సీ. హిమశైలతట మెక్కి యీరీతి నీశ్వరు
ధ్యానింపఁ దొడఁగె సద్భక్తి మీఱ
"నోమహాదేవ! శంభూ! జగదీశ్వర!
యఘజాలహరణ! తుభ్యం నమోఽస్తు
భక్తవత్సల! మహాభక్తసన్నిహిత! కృ
పాపూర్ణ! యభవ! తుభ్యం నమోఽస్తు
సర్వలోకశరణ్య! సర్వదేవవరేణ్య!
యఖిలలోకనుత! తుభ్యం నమోఽస్తు

గీ. దేవదేవ! మహాదేవ! దివ్యదేహ!
పాహి పాహి కృపాకర! భక్తవరద!
యీశ్వరా! నన్ను నేవేళ నేలుమయ్య!
హృదయపద్మంబునను వసియింపుమయ్య! ౪౧

గీ. సాంబ! శివ! సదాశివ! శర్వ! శంకర! మృడ!
అభవ! భవ! సర్వలోకభయహరణ! భయ
నిలయ! లయకర! లయహర! నిత్య! సత్య!
శరణు త్వచ్చరణంబుల శరణు శరణు. ౮౨

గీ. లలితచాంపేయగౌరార్ధలసితకాయ!
ఘనసుకర్పూరగౌరార్ధకలితకాయ!
నాథ! బాలేందుమౌళి! జటాధరా! మ
హాత్మ! కైకొమ్ము నాదుసంప్రార్థనంబు." ౮౩

గీ. అనుచు బహువిధకీర్తనాయత్తుఁ డగుచు
సీశ్వరక్రీడనస్థలి నెలమిఁ గాంచి
సత్ప్రదక్షిణముగ శివు సంస్తుతించి
గిరిజ కెఱఁగి మహాభక్తి కీలుకొనఁగ. ౮౪

గీ. ఒడలు మఱచినధ్యానము గడలుకొనఁగ
నచటఁ గడపెను భక్తి నయ్యాభవుప్రమోలఁ
గొన్నిదినములు నిద్రయు క్షుత్పిపాస
లనున వెఱుఁగక కష్టావక్రమునివరుండు. ౮౫

గీ. మృడసమారాధనాఫల మీప్సితార్థ
మొసఁగకుండునె కోరిన నూరకున్నఁ
గోరికొన్న సకాముమైఁ గోర్కి నొసఁగుఁ
గోరకున్న నిష్కాముమైఁ గురుత నొసఁగు. ౮౬

గీ. అఘహారం బగునట్టిహిమాలయంబు
నఖిలమునిసేవ్య మైనహిమాలయంబు
నీశ్వరక్రీడనస్థలి హిమనగంబు
నీప్సితార్థము లిచ్చెడిహిమనగంబు. ౪౭

గీ. భరతజనయిత్రిసత్తపఃఫలనగంబుఁ
బరమపావనభారతభాగ్యనగము
భరతగౌరవచిహ్నసంభరితనగము
విడువ లేక విడువ లేక విడిచె నతఁడు. ౪౮

గీ. హిమనగంబును వీడుమహీసురుండు
ప్రాజ్ఞగంబును వీడునర్యమునిఁ బోలెఁ
బద్మిని నగించి కుముదిని బరిభవించు
రవి యగునె సాటి మునికి సర్వప్రియునకు. ౪౯

చ. తనగురుకార్యనిర్వహణతత్పరతన్ గడుభక్తియుక్తుఁడై
మునివరుఁ డంత నేఁగి కనె ముందట నొక్కమనోహరాత్మకం
బును బరమాద్భుతాకర మపూర్వమహత్త్వవిశేషమూలసం
జనితము నైనదివ్యవనసారము నీపవనంబు నచ్చటన్. ౫౦

సీ. అజ్ఞానతిమిరంబు నపహరింపఁగఁ జొచ్చు
విజ్ఞానభానునివిధము గాఁగ
నంబుజాకరమధ్యమందుఁ జొచ్చి యఘంపుఁ
దీవలఁ ద్రెంచెడుద్విపమురీతిఁ

బాపకౌరవజాతి రూపుమాపఁ గడంగు
విజ్ఞానియభిమన్యువిధము గాఁగ
మబ్బు పెందెరలను మఱుమాయ మొనరించు
బాలప్రభంజనులీల దోఁప

గీ. నీపవనమును జొచ్చి మునీశ్వరుండు
కనుఁగొనెను దానిలో నొక్క-కనకనగము
నందు రమణీయ హైమహార్మ్యములు కొన్ని
యందు సౌందర్యనిధు లైనయంగనలను. ౯౧

మ. కమనీయం బయి దివ్యరత్నగణముఖ్యస్యూతసౌధప్రభా
రమణీయాత్మక మై మహామహిమచే రంజింపఁగాఁ జేయుచు
న్నమితం బై రమణీమణీమయము జ్యోత్స్నాపూరనిర్మగ్నమై
బ్రమదోద్రేకకరంబు నై ననగరప్రావీణ్యముం గాంచఁగన్.

ఆ. ఇంద్రుపురవరంబు నీడు కాదనవచ్చు
ధనదుప్రోలు పోల్పఁ దగదు చూడఁ
జూడఁ జూడ దాని కీడు లేదనవచ్చు
ననుచు వాని లోని కరుగునపుడు. ౯౩

సీ. సంపూర్ణపూర్ణిమాచంద్రమోబింబంబు
నపహసింపఁగఁ జాలునాననములుఁ
గమనీయచాంపేయసుమరమణీయతఁ
ద్రోసిరా జనఁజాలునాసికలును

దివ్యదర్పణమహాదీప్తిసంజాతంబు
దిద్దఁ జాలెడు చెక్కుటద్దములును
బద్మదళంబులపస నీసడించెడు
నిరుపమానవిశాలనేత్రములును

గీ. నవకిసాలమృదుత్వమ్ము నవ్వఁ జాలు
సరసిజాతీతముల్ కరచరణములును
వర్ణనాతీతసౌందర్యవతులఁ జేయఁ
గాంత లొకకొంద అచ్చటఁ గానరాఁగ. ౫౪

గీ. కులుకుఁజూపులు బంగారుతళుకు లీను
ముద్దునగు మోములందు వ్యామోహ మొదవుఁ
దావి యబ్బిన బంగారుతళుకుబొమ్మ
లనఁగఁ జూపట్టు కాంతాజనాళి నచట. ౫౫

క. కాంచి మునిచంద్రుఁ డంత స
మంచితధీయుక్తిఁ జేరి యాకాంతల రూ
పించియును బల్కరింపఁగ
నంచితగతి నతని వార లాహ్వానింపన్. ౫౬

మ. నిజనామంబును గార్గ్యముం బలికి నిర్నిద్రస్థితిం జెందఁ బం
కజలోలాక్షులు వానిఁ దోడ్కొని మహాశాఠ్యార్థభూయిష్ఠతన్
విజనంబై నరహఃప్రదేశమున దుర్వీతూసమారంభ చి
త్తజచేష్టాపరిపూర్ణ లౌచుఁ జని రాత్మప్రభ్విఁ జూపింపఁగన్.

ఉ. వారలయొప్పిదంబును నపారవిలాసమనోజ్ఞసంపదా
కారములన్ మృదూక్తుల వికారవిహీనము నైనచిత్తసం
చారములన్ గ్రహింపఁగ నసారము సర్వ మటన్నబుద్ధికిన్
వారలు దోఁచుచుండిరి ప్రభావమునం దనకన్నతల్లులై. ౫౮

శా. ఆలావణ్యతనూవిలాసములు నాయాచిత్తచాంచల్యలీ
లాలాపప్రభవోత్తమంబు లగునాయాహాసముల్ వింతయా
నాలోలాక్షులమందమందగమనం బాపుణ్యమానీశ్వరున్
లోలుం జేయఁగఁ జాల కున్నవి యలోలుం డైనపుణ్యంబునన్.

గీ. అన్యకాంతలఁ దల్లులయట్లు గాఁగఁ
గాంచఁ జాలినమానవగౌరవంబు
ఖండఖండాంతరముల నెక్కడను లేదు
పరమపావనభారతధరణిఁ దక్క. ౬౦

శా. ఆయభ్యంతరమందిరంబున సమర్హం బైనరత్నావళీ
చ్ఛాయల్ చిమ్మమహాసనంబుపయి స్వచ్ఛస్వర్ణసందీప్తితోఁ
బ్రాయం బందినప్రౌఢయొక్కతె సువస్త్రస్నిగ్ధభూషాళితో
శ్రేయోమేయమనోహరాంగములతో శృంగారలక్ష్మిశ్రీయన్

మ. తనప్రాయంపుటనుంగునెచ్చెలులతోఁ దారుణ్యసంపచ్ఛుభా
ననపద్మంబు మనోహరాకృతుల నీనన్ దివ్యపర్యంకమం
దున లీలామయ మైనచిర్నగవుతోఁ దోరంపువక్షోజసం
జనితామేయపరీమళంబు నిగుడన్ సంభాషణం జేయుచున్. ౬౨

గీ. ఉన్నయుత్తరదిశ యనునువిదకడకు
మునికుమారునిఁ గొనిపోయి మగుడ లపుడు
"జయము! జయము! దేవేరికి జయము! జయము"
టనుచు వినయంబుతో నెల్ల మనవి చేఁ ౬౩

గీ. ఆమహారూపవతి లేచి యర్ఘ్యపాద్య
ముల నొసంగెను భయభక్తిమోదములను
వల దనక యందె మానియు వాంఛ లేక
కన నయాచితలబ్ధభోగమ్ము లగుట. ౬౪

గీ. అతనిఁ బొడగాంచినంత నే యామె కపుడు
తనువు పులకించె మోమునఁ ద్రప జనించె
సిగ్గునునుదొంతరలు నిల్చెఁ జేరె మనము
క్షణములోపల నతనివశంబు గాఁగ. ౬౫

గీ. ఆమెఁ బొడగనినంత నే యతని కపుడు
పైఁబడియుఁ దోన చంచలత్వము నశించెఁ
బుష్పబాణునిశితబాణములును నాఁటి
మొక్కవోయిన వతనియమోహరక్ష. ౬౬

గీ. నయము భయమును వలపు వాంఛయును గలిసి
పరిఢవిల్లఁగఁ బ్రౌఢ యై పడఁతి యిట్లు
పలుకఁ జొచ్చెను మునివంశతిలకుతోడ
సాదరార్ద్రమనోజ్ఞవాచానిరూఢి. ౬౭

ఉ. "ఓసుకుమార ! మారనిభ ! యోమునివంశకులప్రదీపకా !
మాసుకృతంబు లెల్లఁ బరమస్థితి నందెను నీదు రాకచే
నీసుముహూర్తమెంచి గణియించుచునుంటి యుగంబులెన్నియో
యాసనమున్ గ్రహింపుము వయస్యుఁడవై కొనుమయ్యమన్ననల్.

చ. కలిగినదాన నెన్నియొ యఖండమహాధనధాన్యసంపదల్
మెలఁగెడిదాన నీపురికి మేలగురాజ్ఞి పదంబుతోడ నే
నలఁగినదాన నిందనుక నాత్మజఘోరమహాదవాగ్ని చేఁ
గలిగిన నేమి కాంచఁగద కాంతునిఁ గాంతు నిఁ కిచ్చటన్ విభూ !

ఉ. కాంతవిలాససంపదలు కాంతునితో సుఖియించునప్పుడే
వింతలు వింతలై పరమవిస్తృతశాశ్వతరూప మందుటల్
కాంతలు కాంతలే తమదుకాంతులఁ గూడి సుఖింపనప్పు డా
కాంతలు కాంతశబ్దభవకష్టనికృష్టపశూత్కరంబు లౌ. ౨౦

ఉ. అందము చందమున్ నయుభయంబులు గల్గి మనోహరాంగుతో
సుందరి కూడియున్నఁ గడుచోద్యమునం గనుఁగొందు రంట నా
కేందుముఖుల్ సతంబు జనియింపఁగఁ గోరుదురంట భూమిపై
నందము చందమున్ నయుభయంబులు కల్గి పతుల్ గ్రహింపఁగన్.

క. ఈసర్వము నీయదియే
వీసంబును సంశయంబు వెనుకకు మదిలో
నో సౌందర్యవిధానమ !
వాసింతము సంతతంబుఁ బ్రణయార్చనతో." ౨౧

మ. అనుచుం సన్నిధి కేఁగుదెంచి మునిహస్తాశ్లేషముం జేసి యా
తని నాయుత్తమతల్పమం దునిచి మిత్రా! యన్నసంబోధనం
బునఁ బ్రేమాంకురబీజముల్ విడుచుచుం బోఁ బంచె నారీజనం
బును నౌచిత్యసుఖానులాపముల నామోదంబు సంధిల్లఁగన్.

చ. అది యొకమానినీజనవిహారవిలాసకలావనంబు స
మ్మదమున నేలు దాని నొకమోహనరూప త్రిలోకజేత్రి యా
సుదతి వసించు నందు నొకసుందరసౌధమునందు సర్వసం
పదలకుఁ బుట్టినిల్లది ప్రభావవిరాజిత మెల్లవేళలన్. ౨౮

గీ. రత్నసౌధంబు బహురశ్మిరాజితంబు
దివ్యపర్యంకమందు సందీప్తదివ్య
ధవళవసనాంగరాగ సౌందర్యమూర్తి
యూన వేచు నష్టావక్రమానిపతిని. ౨౯

ఉ. "ఎచ్చటినుండి యెచ్చటికి నేమిష నిట్టులు తెచ్చినాఁడ వే
మిచ్చటఁ జేయ నెంచితి మహేశ్వర! నీదుకృపావిలాస మే
యచ్చున నెన్నవచ్చు నహహా! ఘటియింతువు క్షణంబులోన నే
యచ్చపుబుద్ధికిం దెలియనట్టివిచిత్రవిలాసదృశ్యముల్. ౭౦

ఉ. నీకృప కల్గినట్టినరు నిత్యనికృష్టుని నైన సర్వశో
భాకరమౌ మహామహిమ భాస్కరుఁ బోలఁగఁ జేయు దింకఁ దా
నీకృపఁ గాంచనట్టినరు నిర్మలు నైన క్షణంబులోనఁ బా
పాకరుఁ జేయు దెల్లదురితావళిచే క్షణమాత్రలోఁ జెడన్. ౭౧

గీ. జనన మందిన దాది సంసార మనున
దెఱుఁగ కే మునివృత్తియం దెసఁగుచుండ
స్వీకరింపుము గార్హస్థ్యశిక్ష ననుచు
నేల విధియింపఁగా వలె నిట్లు గురులు. ౪౮

గీ. గురునివాక్య మమోఘ మం చురువిధేయ
తాప్రవృత్తుఁడ నైతి నింతయును నేల
యేల యావదాన్యాంధు నన్నిచటి కనిపె
నీశ్వరవిలాసమే కద! యెల్లఁ జూడ. ౪౯

గీ. ఏసతీశ్వరులీలావిలాస మిట్లు
సర్వజీవుల నాడింపఁ జాలు నట్టి
యీశ్వరవిలాసమే నన్ను నీసతీని
వహ్నిదంష్ట్రలనుండి కాపాడుఁగాత!" ౫౦

గీ. అనుచు మానీంద్రుఁ డాత్మఁ బ్రార్థనము చేయు
నీశ్వరుని సర్వదోషాపకృష్టుఁ బ్రీతి
బాహ్యదృష్టికి నేమి తోఁపనికతమున
నామృగేక్షణ పల్కె నత్యంతకాంక్ష. ౫౧

ఉ. "ఓనవయౌవనోజ్జ్వలమహోన్నతరూపవిలాస! దివ్యతే
జోనిధి! మన్మనోహర! విశుద్ధుఁడ! నీయధరామృతంబు నెం
తేనియుఁ గ్రోలి క్రోలి తమిదీఱ సుఖింపఁగ నున్న నాకు స్వ
ప్నానుభవంబు లేల యిఁకఁ బ్రాంజలినౌదు గ్రహింపు మాలిగన్.

ఉ. కాయలు కాచిపోయినవి కన్నులు నీదుమనోహరాంగ మా
ప్యాయముగా నురంబునకు హత్తి సుఖింపఁగ నున్న కాంక్షతో
నాయము జూచి యొక్కపరి నారముఁ జూచి సుఖానుభూతి స
న్నీయెడఁ దేల్పుమయ్య! కరుణింపుమయా! సుకుమారమన్మథా!

ఉ. దోసము లేదు నా కిటను దో డయి నీవు సమస్తసౌఖ్య శ్రీ
భాసముపార్జనంబునను భాగము నంది చిరంబు వర్ధిలన్
వీసము లేదు సంశయము వీనికి నెల్లను సార్వభౌముఁ డీ
వే సఖ! దైవసాక్షి వరియింతు నినున్ హృదయాధినాథుగన్.

ఉ. కన్నియ నేను నీపరమకారుణికత్వ మపేక్ష చేయుమున్
వన్నియు వాసియుం గలుగువారలలోన గణింతు రెన్నఁడున్
న న్నొకదానిగా జగతి నాకు మనోహరరూప! నీదుసౌ
ఖ్యోన్నతభూరిభాగ్యమె ప్రభూత్తమ! నేఁడ యనుగ్రహింపవే!

ఉ. ఉన్నది లోకమోహనమహోన్నతరూపధనంబు నీకు నా
కున్నది తావకీనపరమోత్తమరూపముఁ గొల్లగొట్ట నీ
కున్నది సత్తపోమహిమ మూరక పోవునె తత్ఫలంబు నా
కున్నవి రూపసంపద లహో! యిఁక బంగరు తావి సందెఁగా!"

క. అన విని యష్టావక్రుఁడు
మనమున నొకయింతయు రభిమానముకతనన్
ఘనహృదయతీవ్రపరిశ్రో
ధనమున మాటాడకుండెఁ దన్వీమణియున్. ౮౭

"ఆగర్భసంపద లందినదీనను
భవ్యభిక్షాం దేహి బ్రహ్మచారి !
నవయౌవనోజ్జ్వలనవమోహనాంగిని
భవ్యభిక్షాం దేహి పరమపురుష !
ఆకాంక్షతో నుంటి నన్య మేమి యెఱుంగ
భవ్యభిక్షాం దేహి దివ్యరూప !
ఆజీవితాంత మహర్నిశంబును గొల్తు
భవ్యభిక్షాం దేహి బ్రహ్మవిజ్ఞ !

అధివసింపుము మన్మానసాధినాథ
పదమహాభోగసామ్రాజ్యపరమపదవి
దేహి యని యెన్నఁ డొరుల నర్థించి యెఱుఁగ
నర్థనీయుఁడ వర్థింతు నహరహంబు." ౮౮

అని పతిఁ గ మ్మని కోరిన
వనితామణిఁ గాంచి మధురవచనామృతసం
జనితామేయసుఖంబున
నని తోఁపఁగ నూరకుండె నావటుమణియున్. ౮౯

ఉత్తరదిశయును దనకా
యత్తుఁడు కాఁ డేమొ యనెడు ననుమానముతో
నుత్తలపడియును నాతని
చిత్తము రంజింపఁ జేసెఁ జిరసత్క్రియలన్. ౯౦

ఉ. అంతట లోకబాంధవుఁ డహఃపరిపాలన ముజ్జగించి వి
శ్రాంతి వహింపఁ గోరి తమసానది స్నానజపార్థి యౌచు సు
స్వాంతసరోజుఁ డై చనెడియాకృతితో ఘనపశ్చిమాబ్ధి న
త్యంతకళానిధానకిరణావృతుఁ డై పడియెన్ మహాప్రభన్. ౯౧

ఉ. అంత నతండు క్రుంకుటయు నాకసమందు వెలింగెఁ దారకల్
సంతతయావనోజ్జ్వలవసంతరమారమణీయమూర్తు లౌ
కాంతలు సంతసంబున ముఖంబులు వీడి వినీలవస్త్ర దే
హాంతర లై నభశ్చరమహాపదవిన్ గయికొన్న యట్లుగాన్.

ఉ. అప్పుడు తారకాసముదయంబు తమస్సును ద్రోసివేయుచు
న్నప్పుడు తోఁచె మింట నుడునాయకుఁ డద్భుతమోహనద్యుతుల్
దెప్పర మౌవిధంబునఁ బ్రదీప్తము గాఁగ హిమప్రదీప్త మై
యొప్పుచునుండ సర్వమును నూహలు రేఁప వియోగిజాతికిన్.

గీ. బహుళసౌందర్యరూపవిభ్రాజిత లగు
కామినులయొద్ద నున్నపుణ్యాత్ములుంబు
కళల నీనెడుతారకాకాంతలకడ
విభుత నొప్పారుతారకావిభునిఁ బోలె : ౯౪

గీ. వానిచంద్రునిఁ బోలఁ డేమాత్ర మైనఁ
జడల విలసిల్లునట్టియాచంద్రముండు;
అతఁడు తారావశుఁడు ద్రోహి యాతతాయి
హింసకుండు వియోగుల కితఁడు కాఁడు. ౯౫

క. ఉత్తరదిశయును నాఁ డా
యత్తము గావించె మునికి నఖిలాన్నంబుల్
చిత్తమునఁ దగులు లేకతఁ
డుత్తమముని యై గ్రహించె నుచితంబు మెయిన్. ౯౬

గీ. సర్వమును నీశ్వరేచ్ఛగా జగతిఁ గాంచు
బ్రహ్మవిదుఁ డెట్టియెడల నిర్వాంచితుండు
లేమిఁ గుందఁడు కాంక్షింపఁ డేమిగాని
పంచభక్ష్యాన్నలబ్ధి సంబరముపడఁడు. ౯౭

గీ. బ్రహ్మచర్యాశ్రమంబున బ్రదుకుఁ దెరువు
గార్హ్యధర్మప్రపాలనగౌరవంబు
సర్వమీశ్వరార్పణబుద్ధి సహనశక్తి
నేర్పునాశ్రమధర్మ మన్నింట మెఱుఁగు. ౯౮

గీ. ఋషివతంసులు నిర్మించి యొసఁగినట్టి
యాశ్రమపుధర్మములు చూడ నద్భుతములు
విశ్వమందున వేఱొక్కవిషయమందు
నెచటఁ బొడగాన మిట్టియుత్కృష్టపథము. ౯౯

మ. జననం బందిన నాది మానవునకున్ శశ్వచ్ఛుభావాప్తికిన్
ఘనసంసారపయోధి దాఁటుటకు సన్మార్గంబుఁ జూపించు న
త్యనుకూలం బగుధర్మపద్ధతుల నాదర్శంబుగాఁ జేసి క
ర్మనికాయంబుల నేర్పరించునుగదా! మాన్యార్యసిద్ధాంతముల్.

మ. భువిపై జన్మము నంది యెవ్వఁడును దా ముక్త్యర్థ మేత్రోవకో
యవివేకంబున నేఁగఁబోవఁడుకదా! యార్యోక్తధర్మంబుఁ దా
ను వివేకంబుగఁ బాటిసేయునెడఁ బుణ్యుండై యిహాముత్రసౌ
ఖ్యవిలాసంబుల నోలలాడునుగదా! యాదర్శ మాజీవికన్. ౧౦౧

మ. అమలంబై పరిపూర్ణమైన మనవర్ణాచారసంపత్తి ని
త్యము శుద్ధాత్ములఁ జేయుఁగాదె! మనకామ్యంబుల్ ప్రసాదించి యం
తమునన్ మోక్షపదం బొసంగఁ గల దీధర్మప్రబుద్ధాత్ములన్
యముఁడైనం గనఁజాలఁడంట మనభాగ్యం బింక సామాన్యమే!

గీ. ఆశ్రమాదర్శ మది చూడ నద్భుతంబు
బ్రహ్మచర్యంబునందె సర్వమును నేర్చి
గార్హ్యధర్మంబుఁ బాటించి కడకు ద్విజుఁడు
తాఁ దృతీయాంతిమంబుల ధన్యతఁ గను. ౧౦౩

క. అష్టావక్రమునీంద్రుఁ డ
వష్టంభము లేక ధర్మవశుఁడై వనితా
దుష్టకుతూహలసిద్ధి న
నిష్టంబునఁ ద్రోసిపుచ్చె నిశ్చలమతి యై. ౧౦౪

ఆశ్వాసాంతము.

చ. అమలినమానసాంబురుహ! ఆశ్రితరక్షణదక్ష! ఉత్తమో
త్తమపరమర్షి! యోగిజనతాప్రతిమప్రవణాంతరంగ! సం
తమసవిదూరభాస్కర! వ్రతాచరణైకమహాప్రదీపకా!
విమలమహాప్రబోధఘనవిజ్ఞ! మహాత్మ! దయామయా! ప్రభూ!

పంచచామరము :

మహావిరాగసంపదార్ష్టమత్తనాగశేఖరా !
విహారసర్వదేశలభ్యవిశ్రుతప్రజార్చితా !
ఇహంబునన్ బరంబునన్ నిరీహ నిచ్చుసద్గురూ !
వహింపుమయ్య ! మామకీనప్రాణరక్ష నిచ్చలున్ ౧౦౬

గద్యము. ఇది పరమేశ్వరస్వరూపగురుకటాక్షలబ్ధకవిత్వ గౌతమ
సగోత్రపవిత్ర వేంకటేశ్వరపౌత్త్ర్రా న్నపూర్ణాంబా వేంకట
సుబ్రహ్మణ్యేశ్వర చతుర్థపుత్త్రి బులుసు వేంకటే
శ్వరప్రణీతాష్టావక్ర చరిత్రమునందు
ద్వితీయాశ్వాసము.



ఓం

# ష్టావక్రచరిత్రము

## తృతీయాశ్వాసము.

శ్రీయుత! సంభావ్యప్రతి
భాయుత! నిఖిలాగమాంతపారంగత! వి
ద్యాయోషామణి మెచ్చిన
ప్రాయంపుటనుంగుబిడ్డ! బ్రహ్మజ్ఞానీ! ౧

వ. "దేవా! తదనంతరకథాక్రమం బెట్టి దట్టిమహనీయగుణగరిష్ఠుం డగునష్టావక్రుఁ డేమి చెప్పె నెట్లుండె చెప్పవే యట్టి బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడు త్రిలోకపూజ్యుఁడు త్రికాలస్మరణీయుఁడు గదే!" యనుయుధిష్ఠిరునుత్సాహంబున కామోదించి భీష్ముఁ డిట్లు చెప్పఁ దొడఁగె. ౨

గీ. "రమ్యమణిమయకాంతివిరాజితంబు
హంసతూలికాతల్పంబునందు మాని
నుచితప్రియవచనంబుల నుంచి యామె
నవ్యపరిమళవిలసితాననము నందె. ౩

గీ. ఏవిలాసంబుఁ జూపిన నించుకైన
సంచలింపనిమౌనీంద్రుఁ డెంచు మదిని
మఱియుఁ జూచెదఁ గాక ని మహితవిభవ
శోభితాపాంగ యై మునిసూనుఁ గాంచి. ౪

క. సీ తయ్యోనేమొ యనుచును
నాతనితల్పంబుఁ జేరి యభినవమూర్తిన్
నాతుక కౌఁగిటఁ జేర్చిన
నాతఁడు చలియింపఁ డయ్యె నప్పటికైనన్. ౫

గీ. అఖిలలావణ్యపుంజ మైనట్టివనిత
నవనవోజ్జ్వలయౌవనానందదాత్రి
శయ్యఁ జేరిననైన నిశ్చలత విడఁడు
మౌనిమానస మెంతనిర్మలినమొ కద ! ౬

గీ. అంత వనితాంతరంగ మనంత మైన
చింత వలవంతఁ గడువింత నంత కంత
కెంతయును వంత కాకర మంతఁ గాఁగఁ
గంతు నెంతయుఁ బోలినకాంతుఁ జూచి. ౭

ఉ. "ఏమని వేఁడుకొందును మునీశ్వర ! నీదుకృపావిలాసహా
సామలదివ్యదృష్టి నొకసారి పయింబడనిమ్ము చాలునో
యీ ! మహితానుభూతి యగు నయ్యదియే యిఁక లాఁతిదానవే ?
మామకజీవనౌషధము మాటలు వేయును నేలనీవెనూ ! ౮

క. మగవారు భోగపరు లని
 వగ మానితి నిన్నుఁ జూచి వరణీయ నన్
 నగుఁబాటు చేయ కేలుము
 వగ లుడుపుము సర్వలోకవంద్య! మహాత్మా!

శా. నాసర్వస్వము నీవె సుమ్ము పలుకుల్ నా కింక వేయేల నీ
 దాసీత్వంబున గొప్పగొందును సదా దాస్యంబు నేఁ జేయుదున్
 నాసంపత్తులు దివ్యభోగములు నీనారీజనానీకమున్
 నీసొత్తే యగు నేఁటినుండి మఱి ప్రాణేశుండ వీవే యిఁకన్."

చ. అని కరుణాపరత్వమున నర్మిలి వేఁడిన వాని యాత్మలోఁ
 గనలియుఁ జెప్పి చూచెదను గా కని దీర్ఘవిమర్శనాంతరం
 బున "వనితా! పరాంగనలమోముఁ గనుంగొనఁ జాల మేము మా
 కును భవదీయభోగములకుం గల దంతర మెంతయో" యనెన్.

క. పలికినపలుకుల కపుడా
 చిలుకలకొలికియును దనదుచిత్తములోనన్
 మెలఁకువ యలుకయుఁ గలుగఁగ
 వలపులవిరిబోణి పలికె వటుమణితోడన్. ౧౨

చ. "పలికితి కోటివేల్పులుకె బంగరు వాయెను నింతదాఁక నీ
 పలికినదానిభావ మది ప్రస్ఫుట మాయెను సంతసంబు మా
 కలవడ దంతనీతి విరహార్తిమెయిన్ సుకుమారరూప! నీ
 యలఘుతరప్రవర్తనము హాని గడించు నె మమ్ముఁ గూడినన్."

అన నాయష్టావక్రుఁడు
"వనితా! వేయేల! యన్యవనితలఁ గూడక
గన సప్తవ్యసనములం
దున నత్యంతమును దోషదూషిత మగుటన్. ౧౪

ఆ. శూద్రవనిత యైనఁ జొప్పడు నత్యంత
దోష మామె విప్రదుహిత యైన
నగును బాతకంబు నప్రమేయంబును
గానఁ గాంతి వలనఁ గాదు నిన్ను. ౧౫

చ. అదియునుగాక నేను బ్రథమాశ్రమమందుఁ జరించియుంటి నిం
తదనుక మాగురూత్తముని దన్పుచు నస్ఖలితప్రదీప్తితో
మదిఁ గరుణించి వాఁడు నను మాన్యునిఁ జేసి గృహస్థధర్మముం
బదిలముగా గ్రహింపు మన వచ్చితి నాపఁకై తలోదరీ! ౧౬

ఆ. కాన నేను బోయి కన్యకఁ గైకొని
యాశ్రమంబు నడుప నరుగ వలయు"
ననిన వానిమాట లాలించి నాతియుఁ
బలికె నిట్టు లమితభావ మలర. ౧౭

ఉ. "కన్యక నేను నస్ఖలితఁ గాన గ్రహింపఁగవచ్చు నీకు సా
మాన్యను గాను నన్యుల నుమాసతితోడు వరింప లేను నీ
మాన్యతఁ గాంచినంత ననుమానము లేక వరించియుంటి నీ
వన్య నొకర్తుఁ గన్యకను నారయ నేల గ్రహింపుమీ ననున్.

క. వెదుకఁగఁ బోయినతీవయె
పదములకున్ దగిలె నన్నపద మీయెడలన్
విదిత మగుఁ గాన నీ వీ
యెద నెఱిఁగి పరిగ్రహింపుమా ! మత్కరమున్. ౧౯

గీ. తావకీనగురూత్తమోత్తమునియానఁ
బాటవంబునఁ జెల్లించువాఁడ నౌదు
వస్మదీయమనోభీష్ట మదియుఁ దీరుఁ
దనరుఁ దీర్థము మఱియు స్వార్థమును రెండు. ౨౦

గీ. తనకుఁ దానై లభించినదాని విడువఁ
బ్రాజ్ఞు లొల్ల రటన్నయర్థంబు వినవె?
వలచి వచ్చినవనితఁ జేపట్టవలయు
ననెడియార్యోక్తి నెన్నఁడు వినఁగ లేదె? ౨౧

చ. మనమున సంశయంబు మఱుమాయ మొనర్పుము కూర్మి నాదుపా
వనకరమున్ గ్రహింపుము శుభం బగునాశ్రమవృత్తి నుంద ము
త్యనుపమదివ్యభోగముల నంది చిరంబు సుఖానుభూతితో
మనము వసింతమోయి! పరమంబును గందము రమ్ము నెచ్చెలీ!”

క. అను ప్రౌఢాలాపములన్
విని “మగువా! నాకు నివియు వేయును నేలా?
మనమందు నిశ్చయించిన
వనితను విడనాడి నిన్ను వలతునె?” యనినన్. ౨౩

క. ములుకులవలె నాఁటిన యా
పలుకుల కడలొంది యొక్కపరి దైన్యంబున్
వలవంత యినుమడింపఁగఁ
బలుకున్ లలితాంగి కరుణభావ మెలర్పన్. ౨౮

ఉ. "అక్కట! యెన్ని చెప్పినను నాఁడుచేయుదు నామనోరథం
బెక్కరణిన్ ఫలించు నిఁక నీనవమోహనదివ్యరూప మీ
యక్కునఁ జేర్చి నిత్యము సుఖాంబుధిఁ దేలినఁ గాక నీకు నే
నెక్కడఁ జెప్పుకొందు నిఁక యింతులకామమహాగ్నిదుర్వ్యథల్.

మ. తమవిద్యాకులరూపసంపదలు కాంతల్ చూడఁగాఁ బోవు కా
మమహాభూతము సోఁకినన్ గనరు సన్మార్గానుసంచార మ
త్యమలం బైనబతివ్రతాజనకథాత్యంతార్థముల్ వీనులన్
గమనీయంబుగ సోఁకనీరు పలుకంగా రావు మారవ్యథల్.

క. ఏవంవిధకామవ్యథ
సేవింపఁగ నున్ననన్ను శిక్షించెద వే
భావింపుము హృదయంబున
సేవింపఁగనిమ్ము నిన్నుఁ జిత్తజరూపా!" ౨౯

చ. అన విని విన్నఁబాటు హృదయంబున సోఁకఁగ "నేమి చేయుదే
మని విడిపించుకొందు నిఁక హా!" యని "యోసతిరూపుగన్న డా
కిని! ననుఁ జంపినన్ సరియె కేవల మిట్టిమహాపరాధ మే
నొనరుపఁ జాలఁ బోదు"నన యుగ్మలి నవ్వుచు నాఁపె నాతనిన్

క. "ఏఁగెదరుగాక నాపని
సాఁగించినపిదప" ననుడు సద్విజుఁడును "నే
నాఁగెదను నన్నుఁ గదియక
యేఁగిన" ననఁ జనియె నామె యింకొకపనికై ౨౯

ఉ. అచ్చట మౌనిచంద్రుఁడుఁ బ్రియం బెసలారఁగ నామె పోవుటన్
మెచ్చి మనంబునం దలఁచె "మానవిలోచన నెంచిచూచినన్
సచ్చరితంబునన్ వెలయుసాధ్విగఁ దోఁచును గాని యన్య మే
యచ్చునకైనఁ దోఁప దిట నామె వసింపఁ గతం బదెట్టిదో?

గీ. ఈమె స్వర్గనారియో లేక యిచటఁ బడ్డ
నాగకన్యావతంసమో నాఁగ ఁను
శాపకారణ మేదో కానోపు నిచట
నీవిధంబున నుండఁ గా కింత యేల?" ౩౦

చ. అని తలపోసిపోసి కరుణాకరుఁడైన మహేశుసత్కృపా
ఘనతయె లేనినాఁడు క్షణకాలమునం జెడియుండు నేకదా
యనితరసాధ్యమైనకృప నందగఁ గంటి మనంగఁగంటిఁ గా
కని వినుతించుచున్ గడపె నానిసి యెల్ల మహేశులీలలన్.

చ. విరహుల వేఁచు టే పనిగ విశ్వమునందుఁ జరించుచంద్రుఁడున్
గర మనురక్తిచే మునిశిఖామణిఁ బ్రోవఁగ నెంచినట్లునో
విరహిణియైనకాంతకడు వేగము మాన్పఁ దలంచియో యనన్
జరమనగంబునం బడియె సారసమండలి సంతసింపఁగన్. 33

ఉ. అంతట లోక మర్కముని మహత్త్వము భక్తియు శక్తి మీఱ న
త్యంతతపఃప్రయాసమున నాఁకలిదప్పులు వాసి రుక్మిణీ
కాంతు భజింపఁగాఁ దమము కాలభుజంగము రీతి వ్యాప్తమై
నంతన సత్కృపాకరమహత్త్వము చించినరీతి వేగినన్. ౩౪

ఉ. తూరుపుదిక్కునం బొడముతోయజమిత్త్రునియోగమంబు నెం
తోరహి లోకజాలములతో నెఱిఁగింపఁగ వచ్చుచుండెనో
యీరమణీయనూత్నరుచు లెంతతపఃఫల మందియున్నవో
సారసబంధు తోట కనుచాడ్పునఁ దోఁచె నుషఃప్రదీపికల్.

చ. తెలతెల తెల్లవాఱుటయు తెల్పెను గాఢతమంబు నిత్యమై
వెలయదు వచ్చిపోవు నవివేకుల నెప్పుడు నాశ్రయింప నే
మిలపయి శాశ్వతంబు భ్రమియించుటె కాని సుఖంబు దుఃఖముల్
వలవక వచ్చిపోయెడు నవాంఛితరీతుల నన్నసత్యమున్. ౩౬

గీ. ప్రాగ్దిశాకాంత శేయి తపం బొనర్చి
బాలభానునిఁ గని నీట నోలలార్చ
దివ్యతేజఃప్రభావసందీప్తవితతి
జగతి వ్యాపించె ననఁ దోఁచె గగనలక్ష్మి. ౩౭

ఉ. పూర్వదిశానగంబున నపూర్వవికాసవిలాసమూర్తియై
సార్వజనీనుఁడై విబుధసారసలోకమనఃప్రియుండునై
యుర్విఁ బ్రతిష్ఠితుం డగుమహోత్తమదైవతశేఖరుం డనన్
బర్వున వచ్చె లోకపరిపాలనకై నవబాలభానుఁడున్. ౩౮

చ. దివసముఖోచితక్రియలు దీర్చినమౌనికుమారు చెంతకుఁ
బవనవలాహకోయగమునం దనరారుచు నద్భుతంబు నై
యవిరళదీపపుంజములయాకృతిఁ దాల్చినవారిజాక్షి తా
వివశత నంది వచ్చి కడువేడుకతోడ నొనర్చె సత్క్రియల్.

మ. త్రిజగన్మోహనసుందరాకృతుల నారీశ్రేష్ఠలం బిల్చి యా
నిజనోత్తంసునకుఁ బ్రశస్త మగుస్నానీయంబులన్ గూర్చి య
క్కుజమందన్ నిజహస్తమర్దనములన్ గాఢానురాగంబుతో
నిజలావణ్యవిలాసహాసములతో సీర్వ్వాసె నామౌనికిన్. ౪౦

గీ. స్వర్ణకలశంబుతోడ స్వర్జలము లీయ
సంధ్యవార్చెను మౌని నిష్ఠాపరుఁ డయి
యగ్నిహోత్రాదికము లెల్ల నాచరించె
నఖిలసామగ్రు లామె యింపారఁ గూర్ప. ౪౧

శా. అష్టావక్రమునీంద్రనందనుని సంధ్యావందనాగ్నిక్రియా
శిష్టాచారమహావ్రతస్థుఁ బరమేష్ఠిజ్ఞానలబ్ధప్రభా
విష్టప్రాభవసద్ద్విజోత్తముని సర్వేశార్పితస్వాంతునిన్
శిష్టగ్రామణిఁ దన్పె నామె వివిధశ్రేష్ఠాన్నభక్ష్యంబులన్. ౪౨

మ. లవమాత్రంబును గాంక్ష లేక వని తాలావణ్యసౌభాగ్యసం
భవపీయూషవిశిఖాళి నెల్లఁ దన దౌర్భవ్యప్రభావంబునన్
జవహీనంబులఁ జేసినైచుచుఁ గదన్ సత్త్వాఢ్యుఁ డై కైకొనెన్
"భవలీలావిభవంబు లద్భుతము లౌ! భావింపఁగా"సం చెదన్.

ఈప్రకారము మునికి విం దేర్పరించి
యతని సంతుష్టుఁ గావించె నామె పిదప
నుచితసంభాషణంబుల రుచిరభావ
విలసనంబులఁ బ్రొద్దెల్ల వెళ్లఁబుచ్చె. ౮౪

కలలయం దైనఁ గననిసంఘటనఁ గాంచి
యీశ్వరవిలాసమాత్రగా నెంచి మౌని
సంభ్రమాశ్చర్యముల వివశత్వ మంది
తగులు లేనిసుఖంబులఁ దగిలి యుండె. ౮౫

అఖిలదిశలందుఁ దమ మంత నాక్రమింపఁ
జారచోరసమాజముల్ సంతసించెఁ
బరమపుణ్యప్రవిష్టుఁ డౌభానుఁ డేఁగ
దురితజనులు సుఖించు టబ్బురమె! తలఁప. ౮౬

పంచభూతోన్నముల మౌనివరునిఁ దనిపి
యభిమతార్థసంసిద్ధికై యామె యతని
నుచితశయ్యావ విష్టుఁగా నొనరఁ జేసి
తనదుశక్తిప్రభావవిస్తార మెంచ. ౮౭

అత్యంతసౌరభానంత మై గృహ మెల్ల
ఘుమఘుమవాసనాఘూర్ణ మయ్యె
రమణీయవజ్రమణిమయస్యఘనకాంతి
దేదీప్యమాన మై తేజరిల్లె

హంసతూలికలపర్యంకమ్ము మార్దవ
పరిపూర్తిచే నూత్నభావ మందెఁ
జిత్రప్రదీపికాశ్రేణి యద్భుతకాంతి
స్వర్ణసందీప్తప్రశస్త మయ్యె

గీ. నాకజగనోన్మోహినీరూప మొనరఁ దెచ్చె
వర్ణనాతీతశృంగారవసు వితతిఁ
బుష్పవృష్టి గురిసె నాకపూపుఁబోఁడి
యభినవోద్దీప మైనపర్యంకమందు. ౨౮

క. కపురంపుతోడిబాగా
లపురూపపుదివ్యగంధ మాలేపనముల్
ఉపదిష్టసర్వవస్తువు
లపూపములతోడ నిండె నాగది యెల్లన్. ౨౯

మ. శతకోటీందుసమానసుందరతనూసౌభాగ్యసంపత్సుశో
భిత మబ్జాస్యము నుల్లసన్మధురచాంపేయప్రభాఘ్రాణ మం
చితచంచద్ఘనచంచరీకచికురశ్రేష్ఠంబు లబ్జాక్షు లా
తతపద్మప్రకరప్రభాంగములతోఁ దారుణ్యసంపూర్ణయై. ౩౦

మ. అవధానంబున నెల్లవేళలను భక్త్యావిష్టుఁడై సెజ్జపై
నవలీలన్ శివనామసంస్మరణ నత్యానందసంపన్నుఁ డై
సవిలాసంబున నోలలాడెడుమహాసత్త్వాఢ్యుఁ డౌవానిఁ జే
రి విలాసంబుగ వాంఛచేసె నతనిన్ రిక్తప్రయత్నంబుగాన్. ౩౧

క. ఆసుశ్లోకుఁడు నంతట
వీసంబును భ్రాంతి లేక వివిధార్థములం
జేసెఁ బ్రబోధము నాయమ
కాసక్తియు నంతరింప కను నాతనితోన్. ౫౨

గీ. "పరిణతవయస్కు నై నిన్నుఁ బడయఁ గోరఁ
ద్రోసిపుచ్చఁగ నేపాటివాని నీకుఁ
బరమలక్ష్మిసమేత నన్ బరిణయమునఁ
గలయుకంటెను భాగ్యంబు కలదె? నీకు. ౫౩

క. ఏ నిన్ను స్వేచ్ఛ వలచితిఁ
గానీ యిటు నన్నుఁ ద్రోసి కష్టాత్ముఁడ వై
పో నీకు శ్రేయ మెట్లగు?
మానిని గినియంగ మగఁడు మనఁజాలునొకో!" ౫౪

గీ. అనుచు బెదరించునాయమ నరసి యతఁడు
"బాల్యమునఁ దండ్రి భర్త యౌవనమునందు
సుతుఁడు వార్ధక్యమునఁ బ్రోచు నతివ నగుట
స్వేచ్ఛ వల దింతి కెన్ని చెప్పినను వినవు. ౫౫

ఆ. కాన నిన్నుఁ గలియఁ గా రాదు నా కిప్డు"
డనిన మానిఁ జూచి యతివ యంత
సుభగయౌవనయును శోభితాంగయు నై నఁ
జంచలింపఁ డయ్యె సన్మునియును. ౫౬

గీ. "నీవు సామాన్యవనితవు కావు తల్లి!
శాపవశమున వచ్చినస్వర్గవనిత
వో? యెవతెవో? మహాత్మవు పుణ్యురాల!
నిజము చెప్పుము నన్ను మన్నించి తల్లి! ౫౮

చ. కని విని నే నెఱుంగఁ ద్రిజగంబుల నిట్టిమనోహరాంగకం
బును సురమాత్రలబ్ధఘనపుణ్యఫలామలరూప మెన్న స
త్యనుపమదివ్యదీధితుల నాఁడిచేయుఁ దనుద్యుతుల్ తలం
చిన నిది యంతయుఁ బరమచిత్రము చెప్పఁగ దే! యథార్థముల్.

గీ. త్రికరణంబుల ధర్మ మించుకయు విడక
గురునియానతి పాటించునరుఁడ నేని
తావకీనస్వరూపంబుఁ దాల్చి నీవు
నిలచెదవు గాక!" యని ముని పలుకుటయును. ౫౯

ఉ. అంతట స్వస్వరూపమున నాయమ నిల్చి మునీంద్రచంద్రుతో
సంతస మొప్ప నిట్లనుఁ బ్రసన్నముఖాంబుజకాంతితోడ "నీ
వింత కలంగకుండుటకు హెచ్చెను నాకు నతిప్రియంబు నేఁ
గాంత నె కాని యుత్తరపుఁగావలికత్తెను నీపరీక్షకున్. ౬౦

గీ. ఆవదాన్యమహర్షి సంప్రార్థనమున
వచ్చితిని గాని సామాన్యవనితఁ గాను
అద్భుతము గొల్పె నీనిష్ఠ యమరవంద్య!
సకలశుభములు నీ కింక జరగుఁగాక! ౬౧

గీ. సుప్రభాదేవిపరిణయశుభము నీవు
నందఁగల వింక దాన నీ కైహికంబు
సుఖదమౌ సర్వశుభములు చూఱకొనుచు
నందఁగల వాపయిని మోక్ష మమలహృదయ! ౬౨

ఉ. నీరుచిరప్రవర్తనము నిశ్చయ మింక జగంబునందు వి
స్తారయశంబునన్ వెలయు శాశ్వత మై మదభీష్టసిద్ధి కిం
పార గృహస్థధర్మపరిపాలనమం దసమానమార్గసం
చారమునన్ గడింతువు విశాలయశంబు శుభప్రదంబుగన్. ౬౩

ఉ. నీదగుబ్రహ్మచర్యఘననిష్ఠ త్రిలోకములందు నెప్డు డా
హ్లాదకరంబు నై జనుల కాదరణీయము నై మహాశుభా
పాదక మై వెలింగెడుఁ బ్రపంచమునందు దినేశచంద్రు ల
త్యాదరణీయు లై మిగుల నర్మిలిఁ ద్రిమ్మరునంతకాలమున్."

మ. అని దీవింపఁగఁ బుష్పవృష్టి పడఁగా నామ్నాయనాదంబు లిం
పున నాకాశమునుండి వెల్వడియె నొప్పుం జెందె సంకీర్తనల్
మునిశార్దూలునిముందు వచ్చి నిలిచెన్ మోదంబునం బుష్పకం
బును నాకాంతయు సౌధముల్ మఱియుసొమ్ముల్తోనమాయంబులై.

ఆ. పుష్పకంబు నెక్కి పుణ్యాత్ముఁడౌ బ్రహ్మ
చారి క్షణములోనఁ జక్క నిలిచె
నావదాన్యునాశ్రమాంగణంబున నంత
నావిమానరాజ మరిగెఁ బ్రీతి. ౬౬

ఉ. అచ్చట నావదాన్యుఁడును నంతయు సిద్ధము చేసెఁ బెండ్లికిన్
వచ్చినతోడనే శుభదవాక్యములన్ వినుతించె నల్లునిన్
వచ్చినబంధువర్గములవారలఁ జూపి యథోచితంబుగా
నచ్చటఁ జూపె నాతనిమహాగురుదేవునిఁ దల్లిదండ్రులన్. ౬౭

గీ. గురునిపాదంబులకు భక్తిపరత మ్రొక్కి
తల్లిదండ్రులకును బ్రణమిల్లి పిదప
బంధుజనముల కాదరపాత్రుఁ డగుచు
జరగినది చెప్పె నతఁడు నుత్సాహ మెసఁగ. ౬౮

గీ. ఆవదాన్యుఁడు జరిగిన దెల్లఁ దాను
దివ్యశక్తి గ్రహించినతెఱఁగు గురుల
శిష్యులను బంధుజనముల శీఘ్రముగను
శుభమునకుఁ బిల్చి తెచ్చినచొప్పుఁ జెప్పె. ౬౯

గీ. "నేఁడె సుముహూర్తసమయనిర్ణీతదినము
సుప్రభాకన్య హృదయసంశుద్ధితోడ
ని న్వరించియె యున్నది నీవుఁ గూడ
సిద్ధుఁడవు కమ్ము గురునాన స్వీకరించి." ౭౦

గీ. అని వదాన్యుఁడు పలికినవెనుక నతఁడు
గురుపదంబులకును మ్రొక్కి యురువిధేయుఁ
డగుచు భయభక్తిభరితహృదంబుజమున
నతనిదీవెన లంది మిన్నందె వేడ్క. ౭౧

సీ. విజయసంపాదనావిర్భూతసమ్మోద
 వికసితాననపద్మవిస్తరంబు
రంభాదికాప్సరోరామామణీవాంఛి
 తానుపాత్తవ్రతాత్యంతదీక్ష
గురుదేవపరిపూర్ణకరుణాకటాక్షసౌ
 భాగ్యప్రశస్తసంపాదనంబు
శ్వశురపరీక్షానుశాసనోన్నతదిగ్వి
 జయలబ్ధజనితప్రశాంతగరిమ

గీ. అతిశయింపఁగ నొప్పె దివ్యప్రదీప్తిఁ
బెండ్లికొడుకైననాఁడు శోభితమహార్షి
యుత్తమాదర్శవరుఁ డని యువిద లెల్ల
నక్షతల దీవెన లొసంగునప్పు డచట. ౭౨

సీ. నుదుటఁ గుంకుమరేఖ పదనుదీర్చినయట్టి
 విజయసాధనఖడ్గవిధము గాఁగఁ
జెక్కుటద్దముక్రిందఁ జిదిమినకమ్మక
 స్తురిచుక్క నూత్నసుందరులఁ జేయ
నాకర్ణదీర్ఘనేత్రాంచలరమణీయ
 కజ్జలాప్లావితకాంతి మీఱఁ
జిఱుబంతిపసపు సచ్చెరువందఁ బాదప
 ద్మంబుల కలమ సౌందర్య మెసఁగఁ

గీ. బుడమిపైఁ బుట్టి మిగుల నుప్పొంగుసట్టి
రతియు మన్మథుఁడును నాఁగ రమ్యముగను
నూత్నదంపతు లొప్పి రనూనకాంతిఁ
దమణాసై వాహికానందధన్యు లగుచు.

గీ. అమరవంద్యుఁ డష్టావక్రుఁ డయ్యెఁ గాన
నతని వైవాహికానంద మరయ దివిని
నమరతరుణీమణీజాతి యక్షతలను
జలి దీవింప నిలిచె నుత్సాహ మొదవ.

సీ. లలితంపుమామిడాకులతోడఁ గట్టిన
రమణీయబహుతోరణములతోడఁ
గదళికాస్తంభప్రకాశనూతన మైన
రంభాఫలంబులరమణతోడ
శుకపికాలాపసంశోభితాత్యంతసం
గీతనాదామోదరీతితోడ
స్వస్తివాక్యప్రశస్తనినాదవేదమం
త్రనిరూఢు లౌమహామునులతోడ

గీ. నారచీరలు గట్టి విన్నాణ మొదవ
సాత్త్వికతపోనవద్యు లౌసారసాక్షు
లమలహాసానపేతదివ్యాతిదివ్య
లై చరింపఁగఁ బొల్చెఁ గల్యాణవేది.

గీ. శుభదమంగళస్నానవిస్ఫూర్తితోడ
నమలతేజోవిలీనముఖాంబుజమున
వరవరిష్ఠుఁ డష్టావక్రవటుఁడు నంత
విమలకల్యాణవేదికావిష్టుఁ డయ్యె. ౭౬

మంగళస్నానవిహితసౌమ్యప్రదీప్త
సహజసౌందర్యసౌశీల్యసౌమనస్య
సహిత యాసుప్రభాకన్య నరగఁ దెచ్చి
పెండ్లిపీఁటపైఁ గూర్చుండఁబెట్టి రపుడు. ౭౭

ఉ. అంత వదాన్యుఁడుం సతియు నాదర మొప్ప సుతావతంస మ
త్యంతమనఃప్రియత్వమున నర్పణచేసిరి మౌనిహస్తమం
దంతట వేదఘోషము విహాయస మందఁగ మౌనిచంద్ర శు
ద్ధాంతబహిర్గతం బగుట ధన్యత నందిరి పుణ్యదంపతుల్. ౭౮

గీ. వేదవిహితానుసార ముర్విప్రతిష్ఠి
తానుకూలమార్గంబున నంత దివ్య
వైభవముతోడ జరిగె వివాహశుభము
మునివతంసులయాశీస్సమోఘము కద! ౭౯

గీ. అమరకాంతలుఁ బ్రీతిఁ బుష్పములు గురిసి
రతులితానందమైనదంపతులమీఁదఁ
దల్లిదండ్రులుఁ దనయునుత్సవముఁ గాంచి
సుతునిఁ గన్నట్టిఫలము నుత్సుకతఁ గనిరి. ౮౦

సీ. మధుపర్కధారణమాహాత్మ్యవిలసితా
నూనసంపద నొప్పుచున్న వేళ
మాంగల్యజీవనమహితానుభూతికై
మంగళసూత్రముల్ మడుఁచు వేళఁ
గరపద్మవిలసితకాంతివెల్లువలతోఁ
దలఁబ్రాలు శిరముల నిలుపు వేళ
నాజీవితాంతనిత్యానందజీవన
ప్రామాణ్యవచనముల్ పలుకు వేళ

గీ. మునులయాశీఃప్రసాదానుపూర్వ్యముగను
నక్షతాశీస్సుల గ్రహించునట్టి వేళఁ
బుణ్యదంపతు లొప్పి రపూర్వపుణ్య
మూర్తులే యని ఋషులు ప్రమోద మంద. ౮౧

ఉ. అందఱికీర్తనంబులకు నాననము న్వికసిల్ల సుప్రభా
సుందరిఁ బెండ్లియాడి మది సౌఖ్యఁచునుండె మునీంద్రచంద్రుఁడున్
సుందరమందహాసపరిశోభితమూర్తికి సుప్రభామహా
సుందరి నిచ్చి తా మురియుచున్ గనుమోదము నావదాన్యుఁడున్.

ఉ. వైదికమార్గపద్ధతు లవారితమైన తెఱంగునన్ వివా
హాదికకర్మముల్ కడు శుభాంతముగా నట బంధు లెల్ల వ
స్త్రాదికదివ్యవస్తుతతి సాదరభోజనతృప్తితోడ నా
హ్లాదము నంద నింపెసఁగె నట్టివివాహముఁ గాన మెన్నఁడున్.

గీ. ఆత్మతత్త్వ మెఱింగినయతఁడు వరుఁడు
నాత్మవిద్యాసమేత పుణ్యాత్మ వధువు
నాత్మసింహాసనావిష్టు లచటిజనులు
సమరపంద్యవివాహమే యైన దరయ. ౮౪

శా. అష్టావక్రమునీంద్రచంద్రమునివివాహానందపుణ్యోత్సవా
విష్టప్రాభవ మారయం దలఁచి కౌబేరాన్వయం బెల్ల నా
విష్టానందముతో విమానముఁపయిన్ విచ్చేసి దీవించె నా
యష్టావక్రునిసుప్రభన్ బ్రబలహర్షాంభోధిఁ దేలించుచున్. ౮౫

సీ. సుప్రభాష్టావక్రసురుచిరదాంపత్య
వైభవానూనసంపదల నెంచి
యనుపమాదర్శకన్యాదానఫలసము
ద్భూతు వదాన్యునిఁ బొగడి పొగడి
గురుదేవసత్కృపాగురుతరమో యది యెంచు
గురుదేవు నధికతత్పరత నెంచి
సుప్రభాకాంతానుసుకృతసార మటంచు
సుప్రభాకాంతను స్తుతు లొసంగి

గీ. యమితహర్షాంబునిధి నోలలాడి యాడి
యచ్చెరువుగొల్పువర్తన మభినుతించి
యెల్లవారలుఁ దమతమయిక్కలకును
వెడల లేక వెడల లేక వెడలి రంత. ౮౬

గీ. గురుసహితుఁ డై నజామాతఁ గొన్నినాళ్లు
తనగృహంబున నాఁపి వదాన్యుఁ డతని
కభిమతార్థసంపూజన మాచరించి
యమితహర్షాంబునిధి నోలలార్చి పిదప.

ఆ. అల్లునభిమతంబుఁ జెల్లింపఁగా గురు
నాన దాఁటకుండ ననుమతించెఁ
గూఁతుసుప్రభఁ గడుఁ గూర్మి నత్తింటికి
నంప నతఁడు నధికహర్ష మొదవ. ౮౮

మ. తనవిద్యుక్తము నిర్వహించినమహత్త్వప్రాప్తసంతృప్తిఁ జా
వనుఁ డై సంత వదాన్యుఁ డించుకయు సంప్రాప్తానురాగుండు గా
కనియెన్ గూఁతును బిల్చి పంపునపు డత్యంతాదరార్ద్రుండు
ఘన మాదీవెనలున్ సువస్త్రము లలంకారంబు లందిచ్చుచున్.

శా. "అమ్మా! సుప్రభ! యింతదాఁక నిను నాప్యాయంబుగాఁ బెంచి నే
నిమ్మాన్యాత్మున కొప్పగించితిని సర్వేశార్పితస్వాంతవై
గొమ్మా నీహృదయాంతరాళమున నీకున్ జేసియున్నట్టి బో
ధమ్ముల్ వే ఱేఁకఁ బల్కు టయ్యది రవిన్ దర్శించుటల్ దివ్వెతోన్.

గీ. పుట్టినగృహంబు మఱియును మెట్టినట్టి
గృహము పావన మొనరింప నిహమునందుఁ
బరమునందు స్వభర్తతో బ్రహ్మపదముఁ
గనుట యాదర్శ మదికదా కన్నతల్లి! ౯౧

శా. దేహాభాసవిచారణంబుఁ గర మర్థిం జేయుచున్ నీవు నీ
దేహాదిశ్రమ లెన్ని కల్గినను నార్తింజెందఁగాఁ బోకు ము
త్సాహామూల్యధనంబుచే సతము భర్త్రాజ్ఞానుసారంబుగా
'నోహోహో!' యని సర్వలోకములు నిన్నూహింపవర్తింపుమా".

చ. అనుచు వదాన్యుఁడున్ సతియు సర్మిలి గాదిలిబిడ్డఁ బ్రేముడిన్
బనుపఁగ నుత్సహించుచు మనంబుఁ దలంకఁగ మోహపాశ ము
త్యనుపమమైన నశ్రువుల ధైర్యమునన్ బడనీక యుంచుచున్
దనయను బంపి రెట్టిలో; విదారకముల్ కద! మోహపాశముల్.

గీ. బంధములు లేనిగురుఁడు సబంధుకముగ
శిష్యసంతతి కొలువ విచ్చేసెఁ దాను
నేకపాదునిప్రార్థన మెంచి ప్రీతి
నతసియాశ్రమభూమి కత్యాదరమున. ౯౪

గీ. అంత నేకపాదుండు గృహప్రవేశ
శుభము నడపె నష్టావక్రసుందరులకు
విం దొనర్చెను భక్తినాఁ డందఱకును
బిదప గురుఁడు దంపతులఁ బిల్పించి ప్రీతి. ౯౫

చ. ఇరువురమానసంబు లొకయింతయు భేదములేక యుండఁగా
నరసి గృహస్థధర్మములు నర్థవివర్జితసర్వకర్మముల్
బరమదయాసముద్రు లగుబ్రహ్మమునీంద్రులపాదసేవయున్
బరువడిఁ దెల్పి సర్వసమభావము నంత యథేచ్ఛమైఁ జనెన్. ౯౬

శా. అష్టావక్రమునితల్లిదండ్రులును దా రత్యంతసంభావ్య సం
తుష్టస్వాంతులు నై కుమారవరుఁడున్ గోడల్ ప్రభాదేవియుఁ
శిష్టానందులు గొల్వఁ గొన్నిదినముల్ స్వేచ్ఛన్ సుఖం బంది తా
మిష్టావాప్తి గడించి యేఁగిరి మహాత్మ స్థిర సభోగామ్ములై. ౯౭

సీ. నిశ్చంచలబ్రహ్మనిష్ఠా గరిష్ఠుఁడై
తనధర్మపథ మింత తప్పకుండ
గార్హస్థ్యధర్మసగౌరవానుష్ఠాన
నిత్యకర్మ కలాపనియతితోడ
నతిథిదేవాభ్యాగతాత్యంతబాంధవా
దరపాత్రుఁడై సర్వతంత్రుఁ డగుచు
నాస్తంబబ్రహ్మపర్యంతమ్ము సమభావ
మాత్మభావము నిత్య మమరుచుండ

గీ. సుప్రభాకాంత కలిసివచ్చుచు నుతింప
నఖిలభాగ్యముల్ పుత్త్రపౌత్త్రాభివృద్ధి
నంది యాదర్శజీవనానందుఁ డగుచుఁ
గడపెఁ గాల మష్టావక్రఘనుఁడు బిదప. ౯౮

గీ. ఎల్లవిధముల నాథునియుల్ల మెఱిఁగి
యనుసరించి పతివ్రత యై సతంబు
శౌచలక్ష్మి యనంగ విస్తారయశముఁ
బడసి యాదర్శనారి సుప్రభ వెలిఁగె. ౯౯

గీ. ఆప్రకారము జీవితయాత్రఁ గడపి
బ్రహ్మవిజ్ఞానసంపదఁ బడసి తుదకు
బ్రహ్మనిర్వాణ మంది రాభవ్యదంప
తులు నుతింపఁగ ముల్లోకములును భక్తి. ౧౦౦

క. అష్టావక్రచరిత్రము
నిష్టావాప్తికిఁ బఠింతు రెవ్వరు వారల్
శిష్టాచారత విందు ర
వష్టంభము లేక శాంత్రు బహుళేప్సితముల్."

మ. అని భీష్ముండుఁ గృపాపరాయణత నీయాఖ్యానముం జెప్పఁగా
ననువొందంగ యుధిష్ఠిరుండు విని యత్యానంద నిర్మగ్నుఁడై
తనప్రశ్నంబున కుత్తరంబు గలుగన్ ధన్యాత్ముఁడై సన్మునీం
ద్రుని భీష్మున్ వినుతించె నెంతయును సంతోషంబు శేకెత్తఁగన్.

ఆశ్వాసాంతము.

శా. బ్రహ్మణ్యప్రవరాఖిలాంధ్రజనసుబ్రహ్మణ్యచూడామణీ!
బ్రహ్మేశార్పిత సర్వజీవసమహాభాగ్యప్రభావోదయా!
బ్రహ్మజ్ఞానవిరాజితోన్నత శుభప్రఖ్యాతజీవామలా!
బ్రహ్మానందవిధాయకా! త్రిభువనబ్రహ్మణ్యసంధాయకా!

పంచచామరము :
శివా! శివా! యటంచు నిత్యచిద్విలాససంపదన్
భవాబ్ధి నొక్కలీల దాఁటి బ్రహ్మతత్త్వభాగ్యమున్
జవంబుతోడఁ గాంచి దివ్యసత్త్వమూర్తియై మముఁన్
భవంబుఁ బాచి ప్రోచినట్టి భద్రమూర్తిఁ గొల్చెదన్. ౧౦౪

గద్యము. ఇది పరమేశ్వరస్వరూపగురుకటాక్షలబ్ధకవిత్వ గౌత
సగోత్రపవిత్ర వేంకటేశ్వరపౌత్త్రా న్నపూర్ణాంబా వేంకట
సుబ్రహ్మణ్యేశ్వర చతుర్థపుత్త్ర బులుసు వేంకటే
శ్వరప్రణీతాష్టావక్రచరిత్రమునందుఁ
దృతీయాశ్వాసము.

సంపూర్ణము.

సతతమూర్ధంబున వాఙ్మనస్క్రియల నానందంబు సంధిల్ల ను
త్కృతి కన్యామణి నీ కుపాయనముగా దేవా! మహాభక్తి సం
కితముం జేసితి! దేవదేవ! యిదె శ్రీకృష్ణార్పితస్వాంతలో
శ్రితమందార! గురూత్తమా! నను గాపాడింపఁగదే! నిర్గుణా.

శ్రీ శ్రీ శ్రీ




బాల్టర్ మన్ ప్రింటర్సు, కాకినాడ.